Chandamama, Sept. '53 | Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆహారమంత్రి

పంపినవారు :
డి. ఇ. విజయమ్ - బొంబాయి

హిమగిరినుండి కన్యాకుమారివరకు

హిందీ, తెలుగు, తమిళ భాషలలో విడుదల!

భరణీ వారి

# చండీరాణి

భానుమతి

రామారావు...రంగారావు...రేలంగి

డైరెక్షన్... భానుమతి - నిర్మాత... రామకృష్ణ




స్టూడియో
భరణి

మీ అభిమాన థియేటరులో చూడండి.

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవన్నీగాక తొమ్మిదిమహత్వం - రంగులబొమ్మ కథ - మైపుచిత్రాలు
ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

PHONE: 31 GRAMS: PUBLISHERS




## మీడియమ్ డిక్షనరీ

## Balasaraswathi Pictorial Medium Dictionary

**ENGLISH - ENGLISH : TELUGU**

with English Synonyms, Antonyms, Definitions and Illustrations together with an Encyclopedia for Students

విద్యార్థులారా !

మా డిక్షనరీ విద్యార్థులకు-విజ్ఞానవేత్తలకు నిత్యం వారు చేసే విద్యా వ్యాసంగంలో ఎంతో ఉపయోగపడుతోంది. వేనకువేలు దీనివల్ల నేడు లాభపడుతున్నారు. విజ్ఞానం కావాలని, ఆంగ్లభాషలో పరిశ్రమ చేయాలని అనుకొనేవారందరికి చేదోడు వాదోడుగా వుండి, మీకా భాషలో శక్తిసామర్థ్యాలు తక్కువగావున్న లోపాన్ని తీర్చగలదు. ఇందులో మీకు అవసరమైనట్టి పదాలన్నింటిని కూర్చి సరిక్రొత్త పద్ధతిలో ( English to English and Telugu and English synosmny, Antonyms, Definitions,and Illustrations together with an Encyclopedia for students) చేర్చి అందము చందము లొలికేట్లుగా ముద్రించినాము. విద్యకు - విజ్ఞానానికి పరీక్షలో విజయానికి మీకు ఈ డిక్షనరీ ఎంతైనా తోడ్పడగలదని హామీ యిస్తున్నాము. పూర్తి క్యాలికోబైండు మీడియం డిక్షనరీ ధర రు. 9-0-0. జెం డిక్షనరీ ధర రు. 4-8-0. తక్కువ వెల ! ఎక్కువ విలువ !! అవకాశాన్ని జారవిడుచుకోకుండా జాగ్రత్తపడాలని మిమ్మల్ని ప్రత్యేకంగా కోరుతున్నాము.

బాలసరస్వతీ బుక్ డిపో, పోస్టు బాక్సు నెం. 3 కర్నూలు & మద్రాసు 1.

కామేశ్వరి & కో, గవర్నరుపేట, విజయవాడ వారివద్దకూడా దొరుకును.

---



## డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

---

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైంట్లు, గత నెలలో చేరలేదనే కంప్లైంట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

వినాయకపూజలో గరికపోచలు 'దూర్వాలు'
వాడటం ముఖ్యమంటారు. దీనికొక గాథవుంది.
అగ్నిదేవునికి ఒక కొడుకు. వానితీవ్రతను భరించ
లేక ప్రజ వెళ్లి ఈశ్వరునితో మొరపెట్టుకొన్నారు.
ఈశ్వరుడు గణపతిని నియమించగా, వినాయకుడు
అగ్నికొడుకును ఒక ఉండగా నలిమివేసి, గుటు
క్కున మింగివేశాడు! మింగివేశాడేకాని, తాపానికి
తట్టుకోలేక సోలిపోయాడు. ఎన్ని ఉపచారాలు జరి
గినా తాపం తగ్గలేదు. అప్పుడు పరమేశ్వరుడు
'అమోఘ మహిమ గల దూర్వాలు తెచ్చి కప్పండి'
అని చెప్పాడు. ఆప్రకారం చేయగానే బాధ నయమై,
వినాయకుడు లేచి కూర్చున్నాడు. ఆ సంప్రదాయమే
ఈనాడూ గణపతి పూజలో అవలంబిస్తున్నాము.

సంపుటి 13 : సెప్టెంబర్ 1953 : సంచిక 3

# నరుడూ-నాగూ

కాలంమూడిన పా మొకనాడు
ప్రాలుమాలి ఒక నరునికంట పడె,
అమాంతముగ తానా పని చేస్తే
సమస్తవిశ్వం సంతసించునని,
తప్పుకుపోయే పామును పట్టి
గుప్పిట సంచిని గొంతు బిగించి
తను చేసినపని తనకు తృప్తిగా
ఘనత చాటుకొన నరు డిట్లనియె:







'కోరల విషమే! పాలు పోసినా
కరుచు కృతఘ్నువు విడువ రా' దనగ
'పాపం శాంతం పరమ కృతఘ్నుడు
నరుడే; నరునకు నిలువెల్లా విషమే'

అని కడసారిగ పాము బుస్సుమన
నరుడు రోషపడి 'నాదే సబబని
రుజువుచేసియె నిను చంపెద' నన
అజగరమందుకు ఔదల నూచె.

ఆ సమీపమునె ఒక ఆవును గని
ఈ సమస్య నిడి ఏమి చెప్పుదువన
'నా లేగలకును నోళ్ళుగట్టి నా
పాలుత్రాగి తెగబలిసిన నరుడా!






(గేయ కథ)

'చివురులు పువ్వులు కాయలు దోచి
చివరికి నను పాయిచేర్తువె!' యన నది
హూత్తని సర్పం చచ్చేవరకూ
చేతిసంచితో చెట్టును బాదెను.

నచ్చని సబబులు నరునికి చెపితే
పిచ్చికుక్కవలె పీడాకరుడగు
అడిగెకదా యని అప్రియ సత్యం
బుడిబుడి చెపితే భువికే మోసం.

ముసలితనములో విసిరివేస్తివే
కనవులేని యీ పత్రమీదను
ఎంతటి పామును నసనే మించుచు
ఇంత కృతఘ్నత చూపగలదె' యన
అవును కాదని ఎద్దును పిలిచి
'నీవు బుద్ధిగా నిజము చెప్పు' మనె.
'జీవితమంతా పొలమును దున్ని
జీవనసంపద చేర్చిన యెద్దును
ముసలితనంలో కృతఘ్న నరుడా!
కసాయివానికి విడిచితివె' యన
జంతుజ్ఞానం ఇంతేలే అని
చెంతనున్న ఒక చెట్టు నడిగెను :



# అట్టపీదిబొమ్మ

పంచపాండవులు వ్యాసభగవానుని హితవు ప్రకారం హిండింబవనంనుండి బయలుదేరిపోయి ఏకచక్రపురం ప్రవేశించి, ఒక బ్రాహ్మణుని ఇంటిలో కాపుర ముంటూవచ్చారు. ఉన్నట్టివుండి, ఒకనాడు ఆ ఇంట్లోవారందరూ దుఃఖంతో విలపించడం కుంతీదేవి చెవులకు వినపడింది. ఆమె వారిదగ్గరకు వెళ్ళి 'ఏమిటీ సంగతి' అని అడిగేసరికి వారిలా చెప్పారు:

'అమ్మా!—ఏమ్మని చెప్పేది మా అవస్థ? ఈవూరికి సమీపాన అరణ్యంలో బకాసురుడనే రాక్షసుడున్నాడు. వాడు ఊళ్ళమీద పడి జనాన్ని పీడిస్తూ వుండగా, నలుగురూ చేరి 'అయ్యా. రాక్షసరాజా!—మేము వంతులువేసుకుని, రోజూ బండినిండా ఆహారపదార్థాలు మనిషితోసహా సమర్పించుకొంటాము. తృప్తిపడవలసిం'దని ఒప్పందం చేసుకొని అనాటినించీ అలానే జరిపిస్తున్నాము. రేపటిరోజు మావంతు. మాలో ఎవళ్ళు రాక్షసుడికి బలికావటమా అని గొడవపడుతున్నాము' అని చెప్పాడు.

అందుకు కుంతీదేవి "అయ్యా!—మీరెంతమాత్రమూ దుఃఖించవనిలేదు. నాకు ఐదుగురు బిడ్డలున్నారు. వారంతరూ బలాఢ్యులు. అందులోనూ రెండవ వాడైన భీమసేనుడు రాక్షసులను చంపడంలో ఘనుడు. రేపటిరోజున మీబదులు మా భీముడే పోయివస్తాడు. పోయి ఏమిచేస్తాడో నే చెప్పడమెందుకు, మీ కంటితో మీరే చూతురుగాని" అని నచ్చచెప్పగా వారు ధైర్యంచెంది శోకమానారు.

కుంతీదేవి ఈ వార్త చెప్పటంతోనే భీమసేనుడు ఎగిరి గంతువేశాడు. మరు నాడు ఒక పెద్ద బండినిండా దివ్యమైన ఆహారపదార్థాలు పట్టించుకొని, బకాసురుడు ఉండే అడవికి చేరుకొన్నాడు. అక్కడ ఒక చెట్టుకింద స్తిమితంగా కూర్చుని, భీమసేనుడు పదార్థాలను ఆరగించసాగాడు.

అంతలో "ఎవడురా వాడూ!..." అని హుంకరిస్తూ బకాసురుడు వచ్చాడు. నిర్లక్ష్యంగా భోజనంముందు కూర్చునివున్న భీముని వాలకం చూచి ఉగ్రు డయ్యాడు. భీముడు వానికి మాటకుమాట బదులుచెప్పాడు. క్రమంగా చేతులు కలిసినై. అతి పౌరుషంతో వారు పోరాడగా, బ్రహ్మాండమైన రెండుకొండలు ఢీకొన్నట్టు భూమి కంపించింది. చివరకు బకాసురుడు హతుడై నేలకూలాడు. ఈవిధంగా భీముడు ఆ రాక్షసుని పీడ లోకానికి వదిలించి, మెప్పుపొందాడు.




పూర్వం బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక అందాల గిత్తగా పుట్టాడు. ఆ గిత్త నల్లటి రంగుతో, చూడ ముచ్చటగా ఉండేది. ముచ్చటైన ఆ గిత్తను చూచి దాని యజమానులు ఎంతో మురిసిపోయేవారు.

ఆ గిత్తను పెంచే యజమానులు ఒక పేదరాసిపెద్దమ్మ యింటిలో కాపరంవుంటూ వచ్చారు. ఐతే, కొన్నాళ్లకు వారు ఆ వూరే వదిలిపోవలసి వచ్చింది. అలా వెళ్ళిపోయేటప్పుడు వారు పెద్దమ్మకు ఇవ్వవలసిన ఇంటిఅద్దెకింద వారి నల్లగిత్తను ఇచ్చేశారు.

పెద్దమ్మకు పిల్లలు లేరు. ఈ నల్లగిత్తనే తన బిడ్డలా చూచుకొంటూ, ఆమె అల్లారు ముద్దుగా పెంచుకొంటూ ఉంది.

బియ్యంకడుగూ, గంజినీళ్ళూ కలిపి పొట్టువేసి చక్కటి కుడితి తయారుచేసి, ముద్దులొలికే నల్లగిత్తకు పట్టించేది పెద్దమ్మ. గడ్డిపరకలతో దాని ఒళ్ళంతా తోమేది. రోజూ కాలవకు తీసుకుపోయి శుభ్రంగా కడిగేది. ఇంత మక్కువగా పెంచుకొంటున్న ఆ నల్లగిత్తను పెద్దమ్మ ఎన్నడూ కట్టుకొయ్యకు కట్టియెరుగదు.

నల్లగిత్త ఎదుగుతున్నకొద్దీ దానికి చిట్టి చిట్టి కొమ్ములు మొలుచుకువచ్చినై. అది తోడిపశువులతో ఊరంతటా స్వేచ్ఛగా తిరిగేది. కుర్రవాళ్ళు దానిపైన ఎక్కి సరదాగా స్వారిచేసేవాళ్ళు. దాని గంగడోలు దువ్వి దానితో ఎన్నో ఆటలు ఆడేవాళ్ళు.

ఒకరోజున ఆ నల్లగిత్త తనలో అనుకొన్నది: "నన్ను పెంచే పెద్దమ్మ పాపం, కడుపేదరాలు. నాకోసమని ప్రాణంపెడుతూ ఎంతో శ్రమపడుతున్నది. నేను కొంచెం డబ్బు సంపాదించిపెడితే ఆమె శ్రమ తగ్గించినవాని నవుతానుకదా!" అని. ఇటువంటి ఆలోచన తట్టగానే, అది ఎలా ధనం

ఆదినారాయణ




సంపాయించడమా అనే చూపు మీదనే ఉంటూ వచ్చింది.

ఇలావుండగా ఆ వూరికి, ఐదువందల బండ్లపైన ధాన్యం ఎక్కించుకుని ఒక వర్తకుడు వచ్చాడు. ఆ బండ్లన్నీ నాటుబాట మీద బాగానే నడిచినై. కాని మధ్యలో ఒక ఏరు దాటవలసివచ్చింది. ఆ ఏరంతా యిసుకమయం.

ఎంత ప్రయత్నించినా, ఆ యిసుకలో వర్తకుని ఎద్దు ఒక్కటీ లాగలేకపోయింది. అందుచేత బండ్లన్నీ ఏటిగట్టున నిలబడి పోయినై. కొత్తకొత్త ఎడ్లను తెప్పించి బండ్లు లాగించిచూచారు. లాభంలేకపోయింది.

ఈ సమయంలో బోధిసత్త్వుడైనటువంటి నల్లగిత్త ఏటికి అవతలగట్టున తోడిపశువులతో మేస్తున్నది. ఆ మేసే పశువుల మందలో తన అవసరానికి పనికివచ్చే ఎద్దు లున్నవేమోనని వర్తకుడు చూడవచ్చాడు.

చూడగాచూడగా, ఆ వర్తకుని దృష్టి నల్లగిత్తపైన పడింది. 'ఈ గిత్త అసామాన్యంగా కనిపిస్తున్నది. దీని సాయంతో నా బండ్లను సులువుగా ఏరు దాటించవచ్చు' అని అతని మనసుకు తోచింది.

వెంటనే అక్కడ పశువుల కుర్రవాళ్లతో "ఒరే అబ్బాయి! ఈ నల్లగిత్త ఎవరిదిరా? దీనిని కాస్సేపు ఎరువిస్తారా? నా బండ్లను ఏరు దాటించాలి. కోరినంత ధనమిస్తాను" అన్నాడు ఆ వర్తకుడు.

ఇందుకు ఆ పశువులకుర్రవాళ్లు "తీసుకపోయి మీ బండ్లు తోలించుకోండి బాబూ! దీనికి యుజమానికూడానా!" అని చెప్పారు.

వర్తకుడు దాని ముక్కులకు తాడు వేయించి లాక్కుపోజూచాడు. కాని నల్లగిత్త నలుసంతమేరయినా కదిలిందికాదు. దానిని కదపటం ఎవళ్ళవల్లా కాలేదు.

అప్పుడా వర్తకుడు గిత్తను అర్థంచేసుకొన్నాడు. 'తన కష్టానికి తగిన భృతి ఏదో కావాలని ఈ గిత్త అపేక్షిస్తున్నట్టున్నది' అని

తలచి, ఇలా అన్నాడు: 'వృషభరాజా!— నా ఐదువందల బండ్లనూ ఏరు దాటించు. సాయపడితే బండి ఒక్కంటికి రెండేసి వరహాలచొప్పున వెయి వరహాలు నీకు బహుమానంగా సమర్పించుకొంటాను!' అన్నాడు.

వర్తకుడు ఈమాట అనీఅనడంతనే నల్లగిత్త ఉత్సాహంతో ఉరకలెస్తూ అతని బండ్ల వద్దకు పొయి నిలబడింది. నల్లగిత్తను వర్తకుని ధాన్యపుబండికి పూన్చారు. ఒక్కవిసురున అది ఆ ఇసుకలో బండని లాగి అవతలి గట్టుకు చేర్చింది. ఇదెమోస్తరుగా ఆ ఐదువందల బండ్లనూ అవతలిగట్టుకు చేర్చింది.

పని తీరిపోగానె వర్తకుడు ఒక పొడవుపాటి పట్టీలోపల ఐదువందల వరహాలు పెట్టి, ఆ పట్టీని నల్లగిత్త మెడకు కట్టాడు.

ఇలా కట్టగానె బొధిసత్వుడు ఆలోచించాడు: "ఈ వర్తకుడికి దుర్బుద్ధి పుట్టింది. మాట తప్పిపోయాడు. సరె, కానీ!" అనిచెప్పి, ఏటిగట్టుమీద తను చేర్చిన మొట్టమొదటి బండికి ముందుగా నిలబడి అటకాయించింది. దానిని కదపటానికి ఎవళ్ళకూ తరంకాలేదు.

అప్పుడు తెలుసుకొన్నాడు వర్తకుడు— 'ఓహొ! ఇది నోరులేని జంతువే ఐనప్పటికీ ఎంత తెలివైనదీ! నేను ఇస్తానన్న సొమ్ములో సగమే మెడకు కట్టిన సంగతి గ్రహించింది' అనుకొని, తక్కిన ఐదువందల వరహాలూ పెట్టి మరొకపట్టీ తయారుచేసి, దానిసికూడా నల్లగిత్త మెడకు తగిలించి: "రాజా! నీ కష్టానికిగాను నేను వాగ్దానంచేసిన వెయ్యివరహాలూ ఇవిగో!" అంటూ గట్టిగా కట్టివెశాడు.



వర్తకుడు ఈ పని చేసినతక్షణమే నల్లగిత్త వెయ్యి వరహాలూ గల రెండుపట్టీలూ గలగల మోగిస్తూ, తన తల్లి ఐన పెద్దమ్మ దగ్గరకు ఒక్క అంగలో పరుగుతీసింది!

నల్లగిత్త పరుగుతీస్తూవుంటే దాని మెడనున్న పట్టీలూ, అవి చేసె గలగల శబ్దమూ

చిన్నబిడ్డలకు వింతగొలిపినై. మామూలుగా దానితో ఆటలాడటానికి వాళ్లు దగ్గరకు రాబోయారు. ఐతే, నల్లగిత్త వాళ్లను దరిచేరనీయలేదు. అది ఇప్పుడు తల్లివద్దకు పొయ్యే తొందరలో ఉన్నది. అందుచేత తనతో మామూలుగా ఆటలాడుకునే చిన్నబిడ్డలను తప్పించుకు తిన్నగా పోయి, తన తల్లి ఎదట నిలబడింది.

ఒకటా, రెండా!—ఐదుపందల బండ్లు ఒకేసారిగా యిసుకదాటించిన ఆ నల్లగిత్త అలసిపోయివున్నది. అది ఏదో గొప్ప శరీర కష్టం చేసివచ్చినట్టు దాని వాలకమే చెబుతున్నది. కన్నులు రెండూ చింతనిప్పల లాగా ఎర్రబడివున్నయి.

ఇలా అలసివచ్చిన తన నల్లగిత్త కంట పడగానే పెద్దమ్మ దానిని చేరదీసి, దువ్వి, సేదతీర్చసాగింది. మెడ దువ్వుతున్నప్పుడు పట్టీలు రెండూ పెద్దమ్మకు కనిపించినై.

అవిచూచి పెద్దమ్మ "ఇవన్నీ ఎక్కడివే నా బంగారు కొండా!—" అని ఆశ్చర్యపోతూ ఉండగా పశువులకుర్రవాళ్ళు వచ్చి జరిగిందంతా చెప్పారు.

అప్పుడామె కళ్లనీళ్లు పెట్టుకుని, "ఎంత శ్రమపడ్డావు తండ్రీ నాకోసం!—ఎందుకీ నాణాలన్నీ? నేనేం చేసుకుంటాను? నువు కడుపులో చల్ల కదలకుండా, నాకు కళ్ళ వేడుకగా ఉంటావని అనుకుంటే, లేనిపోని కష్టాలు పడుతున్నావే!...రా, బిడ్డా రా!!" అంటూ, అప్పుడు పెద్దమ్మ నల్లగిత్తకు వళ్లు నొప్పులు తీసిపోయేటట్టు నూనెరాసి, వేడి వేడి నీళ్లు ఆరారగా పోసింది. వెచ్చవెచ్చటి గంజి పోసి తాగించింది. ఇంకా ఎన్నెన్నో ఉపచారాలు చేసింది.

ఈవిధంగా బోధిసత్వుడు తల్లిఋణం తీర్చుకొన్న మరికొంతకాలానికే ఇప్పుడున్న నల్లగిత్త అవతారం చాలించివేశాడు.






[భీమవర్మ మకాం దేవపూర్‌లో. కరుణను బలవంతంగా మరెవరికో యిచ్చి వివాహం చేసేటందుకు నిర్ణయించాడు. ఈ రహస్యం విన్న విజయవర్మ, చంద్రదుర్గాధిపతితో కలిసి భీమవర్మ నివసించే భవనంమీద దాడిచేశాడు. దాడి విఫలమయింది. చంద్రదుర్గాధిపతి గాయపడ్డాడు. విజయవర్మ తిరిగి తన నివాసం చేరాడు.—ఇక చదవండి]

విజయవర్మ తన అనుచరులందరినీ ఆ పాడుపడిన సత్రంలో సమావేశపరిచాడు. భీమవర్మ బారినుండి కరుణను రక్షించేటందుకు మార్గాంతరాలు ఆలోచించసాగారు. భీమవర్మ కరుణను ఎవరికో ఇచ్చి రహస్యంగా వివాహం జరపబోతున్నాడనే విషయం ఆ కిందటిరాత్రి తాము చాటుగా విన్న సంభాషణనుబట్టి తెలిసిపోయింది. అయితే, ఈ బలవంతపు పెళ్ళికి అంగీకరిస్తున్న ఆ వరుడెవరు ?

"వాడెవరో తెలుసుకోవాలంటే యీ సత్రంలో కూర్చుని కబుర్లాడితే లాభంలేదు. సరాసరి భీమవర్మ భవనంలోకే జొరబడాలి. అప్పుడుగాని తెలియదు" అన్నాడు పడవల పానయ్య.

"ఖేష్, ఖేష్ ! పానయ్యా, నువ్వు బుద్ధికి బృహస్పతివోయ్ !" అన్నారు అంతా.

"బాగానే వుంది ఆలోచన. కాని, పిల్లికి గంట కట్టేదెవరు?" అన్నాడు విజయవర్మ.

"ఇంకెవరు ? మనిద్దరమే. తెలిసిందా? బయలుదేరు !" అంటూ లేచి నిలబడ్డాడు పానయ్య.

విజయవర్మ తన అనుచరులకు 'జాగర్తగా మసులుకోండి' అని హెచ్చరిక



చేసి పానయ్యతో కలిసి బయలుదేరాడు. పానయ్య సరాసరి అరణ్యంలోకే దారితీశాడు. కొంతదూరం కాలిబాటల వెంట సాగినతరవాత, పానయ్య ఆ బాట తప్పించి విజయవర్మను ఒకానొక గుబురు చెట్లమధ్యకు తీసుకుపోయాడు.

పట్టపగలే గాఢాంధకారమయంగా వున్న ఆ చెట్లమధ్యలో, పానయ్య తన నివాసాన్ని విజయుడికి ఎరుకపరిచాడు. అల్లిబిల్లిగా అల్లుకొన్న అడవితీగల మధ్యన కొన్ని ఎండుకొమ్మలు పరిచి, వాటిమీద చింకి చాపలతో ఒక చిన్న గదిలాగా తయారు చేశాడు అతను.

"ఇదే నా గృహం. బాగా వుందా!" అని అడిగాడు విజయవర్మను.

"నేను నీ గృహాన్ని చూసేటందుకు రాలేదు. కరుణను విడిపించడం ఎలాగో ముందు ఆలోచించాలి. నువ్వు చెపుతానన్న ఆ ఉపాయం ఏమిటి?" అని గద్దించాడు విజయవర్మ, కోపంగా.

పానయ్య నవ్వుతూ, అక్కడవున్న చింకిచాపల కిందనుండి కొన్ని పాతగుడ్డలు బయటికి లాగాడు. అనుమానంగా చూస్తున్న విజయుడికి వాటిని చూపుతూ—

"మనం భీమవర్మ భవనంలో జొరబడాలంటే మారువేషాలతో వెళ్ళాల్సిందే. అన్నిటికన్నా తేలికగా అమరేది సన్యాసి వేషం. పైగా, కావలసిన చోటుకల్లా జొరబడేందుకు ఆ వేషం అవకాశమిస్తుంది" అన్నాడు పానయ్య.

ఈ వుపాయం విజయవర్మకు బాగానే నచ్చింది. పానయ్య తన వేషం నిమిషాల మీద మార్చుకున్నాడు. కాషాయవస్త్రాలూ, మెడలో రుద్రాక్షమాలా, చేత కమండలం —చూడగా హిమాలయాలనుంచి అప్పుడే దిగివస్తున్న యతీశ్వరునిలాగా తయారయ్యాడు. విజయవర్మకుకూడా ఇదేవేషం బాగా అమరింది. సన్యాసివేషాల్లో అంచక్కగా




అమరిపోయిన వాళ్ళిద్దరూ ఒకళ్లకేసి ఒకళ్లు చూచుకొని నవ్వుకున్నారు.

"జైసీతారాం!" అన్నాడు పానయ్య.

"జైసీతారాం!" అన్నాడు విజయవర్మ.

"ఎందుకైనా మంచిది—ఈ 'జైసీతారాం' తోపాటు ఇంకా ఒకటిరెండు వాక్యాలు కూడా గుర్తుపెట్టుకో. 'అలగ్ నిరంజన్' 'సర్వం కల్మషం బ్రహ్మం'—" అన్నాడు పానయ్య.

పడవలపానయ్య అమాయకత్వానికి విజయవర్మ నవ్వుకున్నాడు. వచ్చీరాని మాటలను నోటికిఅందినట్టుగా అనేయడమే తప్ప వాటిలోని అర్థం, భావం, పావిత్ర్యం పానయ్యకేమీ అవగాహన అయినట్టులేదు.

ముందు పానయ్య దారితీయగా, వెనకనే విజయవర్మ బయలుదేరాడు. వారు సరాసరి ఆ అడవి దాటి నర్మదానదీ తీరానికి వచ్చారు. అక్కడ పడవలవాళ్ల కోలాహలం అపరిమితంగా ఉంది.

"రాత్రి నా పడవని కాజేశారు. అది పత్తాలేకుండా పోయింది. ఆ దుర్మార్గులెవరో తెలిస్తే నిలువునా ప్రాణాలు తీసేద్దును" అన్నాడు ఒక పడవల అసామీ.

అతనిచుట్టూ చేరినవారిలో చాలామంది ఇదేభోరణిలో ఉన్నారు. మా పడవ పోయిందంటే మా పడవ పోయింది అని చెబుతూ పరుషవాక్యాలు పలుకుతున్నారు. ఇది చూడగా, ఉన్నట్టే వుండి విజయవర్మకి భయంకూడా పట్టుకున్నది: కొంపతీసి వీళ్లల్లోఎవరైనా తమను గుర్తుపడతారేమోనని.

"జై-సీతారాం!" అంటూ పానయ్య ఆ గుంపును సమీపించాడు. "బిడ్డలారా! ఏమిటీ గోలఅంతా?" అన్నాడు.

ఈప్రశ్నతో పడవలవాళ్లంతా పానయ్యనీ, విజయవర్మనీ చుట్టుముట్టారు. అసలే గుండెబితుకుతోవున్న విజయుడికి, పొరపాటువల్ల పానయ్య రహస్యం కాస్తా బయటపడేస్తా




డేమో అని అనిపించింది. అయినా, యింత దాకా వచ్చింతరవాత తను చేయగలిగిందేముంది ? చూస్తూ వూరుకున్నాడు.

"రాత్రి గాలివానలో మా పడవలను ఎవరోగాని కాజేశారు. అవి యిప్పుడు ఎక్కడ వున్నవో, ఆ చోరులెవరో కాస్తంత అంజనంవేసి చెప్పగలవా నాయనా? నీమేలు మరవం" అన్నారు పడవలవాళ్లు.

"యీపాటిదానికే అంజనా లెందుకయ్యా బిడలారా?" అన్నాడు పడవల పానయ్యా. తరువాత చెయ్యెత్తి నర్మదా నదికి అవలనున్న దేవపూరుకేసి చూపుతూ "మీ పడవలన్నీ నర్మదానదీ గర్భంలో వున్నాయి. వాటిని దొంగిలించిన చోరులు అదుగో, ఆ కనబడే భవనంలోనే వున్నారు. తెలిసిందా ?" అన్నాడు.

ఈమాటలు పడవలవాళ్ళలో ఎక్కడ లేని రోషాన్ని పుట్టించినై. "పదండి! పదండి!! ఆ చోరుల్ని హతమార్చాలి. మన కడుపుకొట్టారు, దుర్మార్గులు! వాళ్ళను బతకనివ్వకూడదు!!" అంటూ ఎవరిచేతికి అందిన అయుధం వాళ్ళు తీసుకున్నారు.

ఇదంతా ఎంతో చోద్యంగా చూస్తున్నాడు విజయవర్మ. పడవలపానయ్యా యుక్తికీ, సందర్భశుద్ధికీ అతడు లోలోపల ఆనందిస్తున్నా—ఏ పొరపాటుమాటవల్ల అసలు రహస్యం బయటపడుతుందోనని భయపడుతూనే ఉన్నాడు.

"బిడ్డల్లారా! తొందర పనికిరాదు" అని హెచ్చరించాడు పానయ్యా. "మా ఇద్దరినీ నది అవతలఒడ్డుకు చేర్చండి. దేవపూరులోని ఆ భవనంలో విడిది చేసివున్న సామంతుల గుట్టుమట్లన్నీ తెలుసుకు వస్తాం. తరువాత మీ పగ తీర్చుకోవచ్చు" అన్నాడు.

"ఐతే బాబులూ! మీరు మళ్ళీ ఎప్పుడు తిరిగివస్తారు?" అని ఆత్రంతో అడిగారు పడవలవాళ్ళు.



"ఎప్పుడోనా! వెంటనే. అన్యాయాలకు పొల్పడిన మీవంటి అమాయకులకు న్యాయం కలగచేయటమే మా విధి. మమ్మల్ని ముందు నది దాటించండి. మరొక్కమాట: ఆ భవనంలోనుంచి నది దాటివచ్చే భటులనెవరినైనాసరే, మేం తిరిగి వచ్చేవరకు ఇక్కడనే బంధించివుంచండి!" అంటూ ఆజ్ఞయిచ్చాడు పానయ్య.

ఈ మాటలకు పడవలవాళ్లంతా పరమానంద భరితులయ్యారు. 'మన పాలిట దేవతలల్లే వచ్చారు ఈ యతీశ్వరులిద్దరూ' అనుకున్నారు. వెంటనే ఒక పడవమీద విజయవర్మనూ, పానయ్యనూ ఎక్కించి నది దాటించారు.

భవనంలో భీమవర్మ బస చేసివున్న ప్రాంతాన పడవ నిలుపుచేయించారు విజయవర్మ, పానయ్యా. అక్కడ భవనమంతా కోలాహలంగా వుంది. వందలాది జనులు పోగయ్యారు. భవనంలోపలినుంచి మంగళ వాద్యాలు వినబడుతున్నయ్.

"ఏదో పెళ్ళికి ఏర్పాటులాగుంది. కరుణను బలవంతంగా యెవరికో కట్టబెట్టబోతున్నారు!" అన్నాడు విజయవర్మ.

ఈ మాటలేమీ పట్టించుకోకుండా పానయ్య 'జైసీతారాం' అనుకొంటూ జనంలో కలిసిపోయి, భవనంలోకి దారి తీశాడు. విజయవర్మ కూడా పానయ్య






లాగానే 'జైసీతారాం' అనుకొంటూ అతనిని వెంబడించాడు.

విజయవర్మ అనుమానం నిజమే అని తేలిపోయింది. భవనంలో అటూ యిటూ తిరుగుతున్న దాసదాసీజనాన్ని చూసినా, అక్కడ పోగైన జనం చెప్పుకునే మాటలు విన్నా—ఇది కరుణకు జరగబోయే బలవంతప్పెళ్లి అని తెలుస్తూనేవుంది. మరి వరుడెవరో ?

విజయవర్మను బాధిస్తూవున్న ఈ సంశయంకూడా ఇట్టే తేలిపోయింది. రంగురంగుల వస్త్రాలు ధరించి, విలువగల ఆభరణాలతో వున్న ఇద్దరుముగ్గురు వ్యక్తులు ఒక పక్కగా చేరి కేరింతలు కొడుతున్నారు. 'జైసీతారాం' అంటూ పానయ్యా వారిదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"ఓహో, యెవరో సాధువులలాగా ఉన్నారే! మన ప్రశ్నలకు వీళ్ళు జవాబు చెప్పగలరేమో చూతాం" అన్నాడు వాళ్లల్లో ఒకడు.

పానయ్యా కమండలం పైకెత్తి "బిడ్డలారా! ఏమిటోయ్ మీ సందేహం?" అని గంభీరంగా అడిగాడు. విజయవర్మ పక్కనే నిలబడి చూస్తున్నాడు.

"కబంధవర్మతో కరుణ వివాహం సక్రమంగా జరుగుతుందా ?" అని ప్రశ్నించారు వాళ్ళు.

"అలాంటి సంశయం మీకేల కలిగింది?" అని అడిగాడు పానయ్యా నొసలు పైకెత్తి, కళ్ళు పెద్దవిచేస్తూ.

"త్రికాలజ్ఞులైన మీకే ఆ కారణం తెలిసి ఉండవలసింది. అయినా మీది చండీదాసు ముఠా కాదుగదా ?" అన్నాడు ఒకడు.

ఆ మాటలతో విజయవర్మ గతుక్కుమన్నాడు. పానయ్యా మాత్రం నిబ్బరంగా—

"బిడ్డా! నువ్వు మాట్లాడేది మాబోటి త్రికాలజ్ఞులకు తెలియందికాదు. ద్రోహీ,



బందిపోటు దొంగలనాయకుడూ అయిన చండీదాసుతో మమ్మల్ని కలపడం మహాపరాధం. ఇందుకు నిన్ను శపించవలసింది. కాని ప్రథమతప్పుగా క్షమిస్తున్నాము" అన్నాడు గుడ్లెర్రచేస్తూ.

పానయ్య ఇలా అనేసరికి ఆ ముగ్గురు వ్యక్తులూ హడిలిపోయారు. "క్షమించండి మహాత్ముల్లారా!" అంటూ వారు పానయ్యా విజయవర్మల పాదాలమీద పడ్డారు.

"లేవండి, లేవండి పిచ్చివాళ్లల్లారా!! క్షమించాం" అన్నాడు పానయ్య. "హిమాలయాలలో అరువదేండ్లు తపస్సుచేసింది, మీబోటి మూర్ఖుల వల్ల నిందలు మోసేటందుకు కాదు. పొండి, క్షమించాం. కరుణతో కబంధవర్మ వివాహం నిరాఘాటంగా జరిగిపోతుంది" అని అంటూనే అక్కడి నుండి బయలుదేరాడు పానయ్య.

విజయవర్మకు విపరీతమైన కోపం వచ్చింది. కబంధవర్మనుగురించి లోగడనే అతడికి కొంత తెలుసు. 'యాభైయ్యో పడి నడుస్తున్న కబంధవర్మకూ, కరుణకూ వివాహమా? భీమవర్మ తలపెట్టిన ఈ దుండగాన్నుంచి కరుణను ఎలా అయినా కాపాడాలి' అనుకొన్నాడు విజయవర్మ. పానయ్య ఊరికే 'జైసీతారాం' అంటూ



భవనమంతా కలయ తిరుగుతున్నాడు. సన్యాసుల వేషంలో వున్న వారిద్దరినీ, ఏ రాజభటులూ అటకాయించలేదు. ఐహిక సుఖాలను ఆశించనివారిని చూస్తే ఎవరికీ అనుమానం ఉండదుకదా!

కాసేపు అలా తిరిగినతరువాత విజయవర్మ పానయ్యను పక్కకుపిలిచాడు. జనసమ్మర్దం లేని ఒక ఏకాంతస్థలంలో ఇద్దరూ కూర్చున్నారు. ముందు కర్తవ్యాన్ని గురించి చర్చ ప్రారంభించారు.

"ఈ పెళ్ళిని ఎలాఅయినా నిలుపు చేయాలి. వెంటనే మనం సత్రం చేరటం మంచిది. అక్కడనుండి కొంతమందిని

తీసుకు రావచ్చు" అన్నాడు విజయవర్మ.

"అదేమీ లాభంలేదు. ఇంకొక్క అర గంటలో పెళ్ళివారంతా అడవిలోని గుడికి తరలివస్తారు. గుడిలోనే వివాహం. మనం మనుషులను వెంటబెట్టుకుని తిరిగివచ్చే టంత వ్యవధి లేదు" అన్నాడు పానయ్య.

"అయితే కరుణకు ఈ ముసలివాడితో బలవంతప్పెళ్ళి జరగవలసిందేనా?" అన్నాడు విజయవర్మ కోపంగా.

నవ్వాడు పానయ్య. తరవాత విజయ వర్మకు సంజ్ఞచేసి, దూరాన గోడను అను కొని నిలబడివున్న ఒకనిని చూపించాడు. విజయవర్మ ఆశ్చర్యానికి మేరలేకపోయింది. అలా గోడపక్కగా నిలబడి పెండ్లియేర్పాటు లన్నీ కనిపెట్టిచూస్తున్న వ్యక్తి చండీదాసు అనుచరుడు. విజయవర్మ చుట్టూ కలయ జూసి 'జైసీతారాం' అంటూ అతడిదగ్గరకు వెళ్ళాడు. తరువాత వంగి, అతడి హస్త రేఖలను పరీక్షిస్తున్నవాడిలా నటిస్తూ—

"ఒక అరగంటలో పెండ్లిమువా అంతా అడవిలోని దేవాలయానికి వచ్చేస్తారు. వ్యవధి లేదు. ఈ సంగతంతా తొందరగా చండీదాసుకు తెలియపరుచు" అన్నాడు.

వాడు నివ్వెరపోతూ 'మీరెవరు?' అన్నాడు

"నేనెవరో తెలియడంలేదా? పోనీ, అదీ మంచిదే. ముందు తొందరగా చండీదాసు దగ్గరకు పో!" అన్నాడు విజయవర్మ. చండీ దాసు అనుచరుడు తలవూపి, అక్కడ నుండి చకచకా వెళ్ళిపోయాడు.

కాస్సేపటికల్లా పెళ్లివారంతా అడవిలోని దేవాలయానికి బయలుదేరారు. మంగళ వాద్యాల కోలాహలం, గుంపులు గుంపులుగా చూడవచ్చిన జనం సందడీ—అంతా గందరగోళంగా ఉంది. పానయ్య విజయ వర్మలుకూడా వాళ్ళతోపాటు దేవాలయానికి బయలుదేరారు. —(ఇంకా వుంది)



# ఒక్క ముఖంతో బహుముఖాలు

చిత్రమైన ఈ బొమ్మ చూడు. ఇందులో నీవు లెక్కలేనన్ని రకరకాల ముఖాలు చిత్రించవచ్చు. ఎలా అంటే: ముందు ఒక మంచి ఉల్లిపొరకాగితం తీసుకో. పెన్సిలుతో సరీగా వచ్చేటట్టు ఈ బొమ్మ జాగ్రత్తగా దిద్దు. దిద్దినదానిని సిరా చెయ్యి. ఈ ఉల్లిపొరకాగితాన్ని ఒక అట్టకు అంటించు.

అంటించడంలో మెలుకువ ఉన్నది. ముందుగానే అట్టకు జిగురు రాసి, కాగితాన్ని దానిపైన పెట్టి, ముడతలు రాకుండా నున్నగా వుండేటట్టు సర్దు.




ఇది బాగా ఎండినతరువాత—ఇంకొక ఉల్లిపొర కాగితం తీసుకో. దానిని అట్టమీద పెట్టు. సరీగా మధ్యని, అనగా * ఈ నక్షత్రం గుర్తువున్న చోట ఒక గుండుసూది గట్టిగా గుచ్చు. ఇప్పుడు ఏదో ఒక టోపీని కాగితంమీద దిద్దు. ఇది అవతలకు తిప్పి, ముఖంవున్న చోటున సరీగా పెట్టి, ముక్కు దిద్దు. మళ్ళీ ఇవతలకుతిప్పి, మరొక ముఖంలోనించి కన్నులు దిద్దు. అలానే మళ్ళీ తిప్పి, ఇంకొకముఖంలో వుండే నోరు దిద్దు. ఇలాచేయుగా, చక్కటి ముఖం ఒకటి ఏర్పడుతుంది.

ఒకొక్క ముఖంలోనుండి ఒకొక్క అవయవంతీసి దిద్దటంవల్ల ఈ బొమ్మలో కనిపించేవే గాక, అనేకమైన కొత్త కొత్త ముఖాలు ఏర్పడటానికి వీలుంది. కొన్ని ముఖాలలో వుండే మీసాలు దిద్దడం మానివేసి, టోపీలకు పక్షియీకలు మొదలైనవి, అలంకారంచేస్తే దొరసానిబొమ్మలుకూడా సులువుగా ఏర్పడతాయి.

ఈ ట్రిక్కు చేయటానికి ముఖ్యం—గుండుసూది కదలకుండా స్థిరంగా ఉండేటట్టు గుచ్చాలి. మెత్తటి నల్లపెన్సిలు ఉపయోగించాలి. దిద్దేటప్పుడు ఎక్కువగట్టిగా నొక్కకూడదు.



# కావేరి పుట్టుక

SANKAR...

పూర్వకాలమందు శూరపద్ముడు అనే రాక్షసుడు ఉండేవాడు. వాడు మహా శక్తివంతుడూ, క్రూరుడున్నూ. వాడి ధాటికి తట్టుకోలేక, సమస్తలోకాలూ గడగడలాడినై. దేవతలుసైతం వణకిపోసాగారు.

దేవతలేకాదు. ఆ రాక్షసరాజు కంటబడకుండా దేవేంద్రుడుకూడా తల దాచుకోవలసిన గతి ఏర్పడింది. అందుచేత దేవేంద్రుడు సరాసరి భూలోకానికి దిగివచ్చి, ఎవళ్ళూ తనను అనవాలు పట్టలేనట్టుగా ఒక అరణ్యంలో వెదురుపొద రూపంలో అవతరించాడు.

కొంతకాలానికి వేసంగి వచ్చింది. అడవిలోని చెట్లన్నీ ఎండిపోయినై. ఐతే, దైవాంశ కలదిగనుక, వెదురుపొదమాత్రం పచ్చగానే నిలిచివుంది. అప్పుడు దేవేంద్రుడు ఆలోచించాడు : 'మండుకుపోయే ఈ వేసంగిలో తోడి చెట్లన్నీ ఎండిపోవటం, నేను మట్టుకు పచ్చగా ఉండటం విడ్డూరంకాదా! ఇందువల్ల నా ఉనికి సులువుగా బయటపడిపోతుందే. ఇప్పుడు నేను నా పలుకుబడివల్ల గంగను భూలోకానికి తెప్పించగలిగితినా నా గుట్టు బయటపడకుండా వుంటుంది ఈ రూపంగా పరమేశ్వరుని అరాధించుకోవటానికికూడా వీలవుతుంది' అని.

ఈ నిశ్చయంతో దేవేంద్రుడు వినాయకుణ్ణి ప్రార్థించగా, గణపతి ప్రత్యక్షమయ్యాడు. ఇంద్రుడు తన కోరికను వెల్లడించాడు. వినాయకుడు దేవేంద్రుని కోరిక తీర్చుదామనే వుద్దేశంతో చూడగా, ఒక్క అగస్త్యుని కమండలంలోమాత్రం నీళ్ళు ఉన్నట్టు తెలుసుకొన్నాడు.

వెంటనే గణపతి కాకిరూపం తాల్చి అగస్త్యుని ఆశ్రమానికి చేరుకొన్నాడు. అక్కడ అగస్త్యమహర్షి మహాతపస్సులో మునిగివున్నాడు. కాకిరూపంలో ఉన్న

గణేశుడు చడీచప్పుడు చేయకుండా, ఏమీ ఎరుగనట్లు వెళ్ళి మహర్షి కమండలం లోని నీళ్లు కాసిన్నీ వొంపేసి పారిపోయాడు!

అప్పుడు అగస్త్యుని కమండలంలో జలం వరదలై భూలోకానికి పారింది. అది పోయి పోయి, దేవేంద్రుడున్న అడవినీ, ఆతని మారురూపంలో ఉంటున్న వెదురుపొదను కూడా తడిపివేసింది.

కొంతసేపైనతరువాత అగస్త్యుడు చూచు కుంటే కమండలంలో నీటిచుక్కయినా లేదు. అల్లంతదూరాన, కమండలాన్ని దొర్లించుకుపోయిన కాకి మాత్రం కనబడింది. ఋషి దానిని వెంటతరిమాడు. కాని అది ఆయనకు దొరకలేదు సరికదా, పదు నాలుగు భువనాలూ తిప్పింది.

అప్పుడు మహర్షి అది సామాన్యపు కాకి కాదని గ్రహించి, దివ్యదృష్టితో చూచాడు. నిజం తెలిసింది. అగస్త్యుడు గణపతివైపు తిరిగి, "ప్రణవస్వరూపా!—నీవెందుకు ఇలా పరుగులెత్తడం? లోకక్షేమంకోసం చేసిన ఈ మహాకార్యం నాకూ సమ్మతమే. ఐతే నా పూజాపురస్కారాలకు ఇప్పుడు కమండలువులో నీటిబొట్టయినా లేదే, ఎలా?" అనేసరికి, వినాయకుడు వెంటనే తన తొండంతో నీళ్లు పట్టుకవచ్చి అగస్త్యుని కమండలువులో వదిలాడు.

తొలుత వినాయకుడు అగస్త్యుని కమండలువులోనించి దొర్లించగా వెల్లువలై భూమిమీద పారిన నీరే ఈనాటి 'కావేరి' నదిగా వెలిసింది.

ఆ తరువాత, ఆరుతలలతో సుబ్రహ్మణ్యస్వామి జన్మించి, లోకకంటకుడైన శూరపద్ముణ్ణి సంహరించాడు. ఈనాడుకూడా ఏటా సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవంలో, శూరపద్ముని సంహారకథ నడుస్తూనే వుంటున్నది.



# రంగులు మార్చే ఊసరవెల్లి

లోకంలో, ఇప్పుడన్న మాట మరి కాస్సేపటికి లేకుండా వుంటారు చాలామంది. అలా మాట నిలకడలేకుండా తరుచు అభిప్రాయాలను మార్చేవాళ్లను 'రంగు మార్చారు' అని అంటారు. ఈ 'రంగు మార్చడం' అనే వాడుక ఊసరవెల్లి నుంచి పుట్టింది. జంతువులలో రంగురంగులు కలదీ, రంగులు మార్చగలిగిందీ ఊసరవెల్లి ఒక్కటే అని చెప్పవచ్చు.

ఇలా రంగులు మార్చగలిగే శక్తి సదుపాయమూ సృష్టికర్త దీనికి ఎందుకిచ్చాడు? అనేది ఒక సమస్య. పరిసరాలనుబట్టి వాటికి అనుకూలంగా అమరిపోయినట్టయితే ఏజంతువుకైనా రక్షణ ఎక్కువగా వుంటుంది. అటువంటి రక్షణకోసమే ఊసరవెల్లి రంగులుమార్చడం.



ఈ ఊసరవెల్లి తొండ జాతికి చెందింది. 'తొండముదిరి ఊసరవెల్లి' అని తెలుగులో ఒక సామెతకూడా వున్నది. దీని చర్మంనిండా రంధ్రాలున్నై. ఇవన్నీ అతి దగ్గరదగ్గరగా ఉంటవి. వీటిలో చిత్రమైన చిన్న అణువులు వుంటాయి. వీటివల్ల వెలుగు దాని శరీరంపైన సోకినప్పుడు అంతా తెల్లగా కనిపిస్తుంది. కొన్ని రంధ్రాలలో నూనెవంటి పదార్థాలున్నవి. ఆరంధ్రాలు మన కంటికి పసుపుపచ్చగా కనిపిస్తవి. మరికొన్ని రంధ్రాలలో ఊదా యెరుపు రంగులు గల మరికొన్ని పదార్థాలున్నవి. అవి మనకి ఆ రంగులతోనే కనిపిస్తవి. ఇన్నిన్ని రంగులతో ప్రకాశించే ఊసరవెల్లి శరీరం ముడుచుకున్నా విప్పుకొన్నా తళుకుతళుకుమని మెరుస్తూ చిత్రంగా కనిపిస్తుంది.

ఈ రంగులు మారడమనేది ఊసరవెల్లి యిష్టానిష్టాలనుబట్టి వుంటుంది. ఐనా, బయటి శీతోష్ణస్థితులుకూడా దాని రంగులు మారడానికి కొంతవరకు కారణాలే అయివుంటున్నాయి.




ఆరావళీ కొండలలో 'అండ్వా' అనే ఒక అడవి. ఆ అడవిలో ఒక పల్లె. ఆ పల్లెకు సమీపంలో ఒక జొన్నచేను. ఆ చేనిలో మంచెపైన కూర్చునివున్న ఒక పద్దెనిమిదేళ్ల బాలాకుమార్తె పిట్టలను తోలుతూవుంది.

కేకలువేసుకుంటూ పరుగెత్తి వస్తూన్న మనుష్యుల కోలాహలం వినిపించింది. 'ఏమిటి చెప్మా?' అనుకుంటూ ఆమె మంచెపై నిలబడి చూసింది. ఆమె చూస్తూ వుండగానే పెద్ద అడవిపంది ఒకటి ప్రాణ భీతితో పరుగెత్తివచ్చి గుబురుగా వున్న ఆ జొన్నచేనిలో దూరి దాగుకొన్నది. దానిని తరుముకుంటూవచ్చినవాళ్ళూ వారిని వెంట బెట్టుకువచ్చిన రాజకుమారుడూ చేనుదాకా వచ్చి ఆగి, పందిని బయటకు రప్పించటం ఎలాగా అని ఆలోచనలో పడ్డారు.

అప్పుడు మంచెపైనున్న కన్య, 'పంది కోసమా చూస్తున్నారు?' అంది. 'ఔను' అన్నారు వాళ్ళు. చివర పదునుగా చెక్కిన ఒక కర్రను పెరికి దానితో ఆమె పందిని అయుఃపట్టున ఒక్క పోటు పొడిచేసరికి అది గిలగిలా తన్నుకొని చచ్చిపోయింది. అప్పుడామె దాని తోక పట్టుకుని బరబరా చేలోంచి యీడ్చితెచ్చి, రాజకుమారుని ముందు పడవేసింది.

వేటలో తాము చంపదలుచుకున్న మృగాన్ని మరెవరైనా పొడిస్తే రాజకుమారులకు కోపం రావటం, అలాగ పొడిచినవాళ్ల ప్రాణాలు సైతం తీయించివేయడం మామూలు. కాని ఆ రాజకుమారునికి మాత్రం ఆ కన్యపైన అలాంటి కోపమేమీ రాలేదు. ఆమె సాహసానికీ బలానికీ అతడు మెచ్చుకుని, తన మెడలోని ముత్యాలహారం ఆమెకు వేయబోయాడు.

ఇందుకామె బిడియపడుతూ, "నాకెందుకండి ఇటువంటి హారం! ఏమంత

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




ఘనకార్యం చేశానని ?..." అంటూ, విన యంగా పక్కనించే పోయి, మంచెఎక్కి, యధాప్రకారం పిట్టలను తోలుకోసాగింది.

రాజకుమారుడూ పరివారమూ మృగాన్ని చంపలేక, దానిని తరుముకురావటంలో అలసిపోయారు. సమీపంలో ఒక సెలయేటి ఒడ్డున విశ్రమిద్దామని కూర్చున్నారు. కూర్చునివుండగా, ఒక మట్టివుండ రివ్వున వచ్చి, రాజపుత్రుని గుఱ్ఱంకాలికి తగిలింది. 'ఎవరుచెప్మా ఈ పని చేసింది?' అని వాళ్లు నలుదిక్కులా చూడగా పడిసెలతో రాళ్లు రువ్వి పిట్టలను తోలుతూవున్న పిల్ల కన పడింది. అప్పుడు పరివారంలో ఒకడు పరు గెత్తివెళ్లి పిల్లతో 'అమ్మాయీ, నువ్వు అపరా ధంచేశావు! ఎవరున్నారో చూసుకోకుండా ఇలాగ రాళ్లు రువ్వవచ్చా?' అన్నాడు. ఆమె వెంటనే మంచె దిగి, జొన్నకంకులు కొన్ని చేతపట్టుకవచ్చి రాజకుమారుని ముందు పెట్టి, 'నా తప్పు మన్నించండి; ఈ కంకులు ఆరగించండి' అన్నది. రాజకుమారుడు కొపించక 'ఫరవాలేదులే' అంటూ ఆమెను పంపివేశాడు.

రాజపుత్రునికి కోపంరాలేదుకాని, తక్కిన వాళ్ళకిమాత్రం ఆమెఅంటే మనస్సులో ఇడిగానే వుంది. మకాముకు పోదామని రాజపుత్రుడు లేచాడు. తీరా పరివారంతో గుఱ్ఱాలెక్కి బయలుదేరేసరికి ఆ కన్య, నెత్తి పైన ఒక పాలకుండతోనూ రెండువైపులా రెండు మేకపిల్లలతోనూ వస్తూ వారికి యెదు రయింది.

రాజపుత్రుని పరివారంలో ఒకనికి ఆమెను బెదిరించాలన్న కొంటెబుద్ధి పుట్టింది. కళ్ళెం వదులుచేసి రికాబులతో గుఱ్ఱంపక్కలు నొక్కి, వాడుదానిని ఆ కన్య మీదకు దుమికించాడు. ఆమె కంగారుపడి పక్కకు తప్పుకోబోతుందనీ అప్పుడామె పాలకుండ కిందపడి బద్దలైతే తమాషా చూసి అందరూ నవ్వుతారనీ వాడు ఆ పని

చేశాడు. కాని ఆ బాలిక చాలా తెలివైంది. వాడి టక్కరితనాన్ని ఇట్టే గ్రహించింది. తొణుకూ బెణుకూ లేకుండా, ఆ గుఱ్ఱానికి అడ్డంగా తన మేకపిల్లలలో ఒకదాన్ని చల్లగా వదిలింది. గుఱ్ఱం బెదిరి ఆ శూరశిఖామణిని నేలపైన పడవేసింది! ఆ పడుచు చెక్కు చెదరకుండా, చుక్కయినా పాలు తొణకకుండా మేకపిల్లలను తోలుకుంటూ ఏమీయెరగనట్లు తనదారిని తను పోయింది.

ఈ వినోదమంతా కనిపెట్టి చూస్తూవున్న రాజకుమారుడు ఆ బాలికను పిలిచి, 'అమ్మాయీ!–నీ వెవరవు?' అని అడిగాడు.

'నా పేరు కురుందేవి' అన్నదామె.

'మీ కులం?'

'రాచకులం?'

'మీ యిల్లెక్కడ?'

'ఆ కనపడే పల్లెలో.'

'మీ తండ్రి నొకమారు మా మకాముకు రమ్మని చెప్పుతావా?' అన్నాడు రాజపుత్రుడు.

'అలాగే' అంటూ ఆమె తన దారిని పోయింది. రాజపుత్రుడు పరివారంతోకూడా మకాం చేరుకున్నాడు. మరునాడు రాజకుమారుని మకాముకు ఒక వృద్ధుడువచ్చి, 'ఏమయ్యా!– మా పిల్లతో చెప్పి నాకు కబురుచేసింది నీవేనా?' అన్నాడు.



'ఔను. కురుందేవి తండ్రి మీరేనా?' అన్నాడు రాజకుమారుడు. ఆ వృద్ధుని గుడ్డలు మాసిపోయి చిరుగులతో ఉన్నాయి. వాటినిబట్టి అతడు చాలా పేదవాడని వెల్లడయింది. ఐనా అతడు నెరసిన కోర మీసాలు సర్దుకుంటూ రాజకుమారుని పక్కనే కూర్చొని సమానస్థాయిగా సంభాషణ మొదలెట్టాడు. పరివారానికంతకూ ఆశ్చర్యంవేసింది. రాజకుమారుడు మాత్రం ఆ వృద్ధుని సాహసానికి మెచ్చుకుని, కొంతసేపైన తరవాత "అయ్యా, మీ కురుందేవి నాకు రాణిగా వుండటం మీకిష్టమేనా?" అని అడిగాడు.

ఆమాట వినేసరికి పరివారమంతా "ఈ పేదవాడి కూతురునా రాజకుమారుడు పెండ్లి చేసుకోవటం!" అని విస్మయం పొందారు. 'ఇంతకంటేనా' అని ఆ వృద్ధుడు ఎగిరి గంతేసి కూతురుని తెచ్చి రాజపుత్రుని పాదాలముందు నిలబెడతాడను కున్నారు వాళ్లంతా. కాని వృద్ధుడలాంటి పని యేదీ చెయ్యలేదు సరికదా, ఏమాటా చెప్పక అలాగే ఊరకొన్నాడు.

రాజకుమారుడు చిరునవ్వుతో, "నేను మీవార్ రాణావారి కుమారుణ్ణి! యువరాణా హరసింగుని!!" అన్నాడు. అందుకు వృద్ధుడు, "తెలుసు. అందుకే నేనూ సందేహిస్తున్నాను" అన్నాడు. ఆశ్చర్యంతో యువరాణా, "ఎందుకు సందేహం?" అన్నాడు.

ఈ ప్రశ్నకు వృద్ధుడు, "మాకు గల ధనమల్లా శౌర్యం, పౌరుషమున్నూ. ఇంతకు మించి మరి యేమీ లేదు" అన్నాడు.

"నేనుకోరింది ఆమెలోని శౌర్యధనం చూచే!" అన్నాడు యువరాణా.

"అలైతే నా కభ్యంతరం లేదు. పిల్ల ఇష్టం తెలుసుకొని కబురుచేస్తా" అంటూ వృద్ధుడు లేచివెళ్ళాడు.

ఆ రోజున కురుందేవిని బెదిరించబోయి గుఱ్ఱంమీదనుంచి కిందపడ్డ రౌతు పక్కవాడితో, "ఈముసలివాడికి ఎంత టెక్కు!" అన్నాడు. ప్రక్కవాడు. "మెల్లిగా మాటాడు! యువరాజుకు వినపడిందంటే మన ప్రాణాలు నిలబడవు. ఆయన రాణావారితో వియ్యమందబోతున్నాడు. ఏమనుకున్నావో!"అని మందలించాడు.

వాడన్నట్టే కురుందేవికీ హరసింగుకీ అతి వైభవంగా వివాహమైంది. ఆ దంపతులకు పుట్టినవాడే శత్రుభయంకరు డని అనిపించుకున్న రాణా హమర్‌సింగు.






పూర్వకాలమందు శ్రీపతి అనే మహాభక్తుడు ఉండేవాడు. ఆయన సకల శాస్త్రాలూ నేర్చిన వాడు, సాధుపుంగవుడు, మంచి వైరాగ్యుడు. ఆయన సతి శ్యామలాంబ. శ్యామల భర్తకు అనుకూలవతి, పతివ్రత, ఉత్తమురాలు, పూతచారిత్ర, గొప్పజ్ఞాని.

ఆ పుణ్యదంపతులకు లేక లేక వర ప్రసాదుడైన ఒక సుపుత్రుడు కలిగాడు. వానికి లోకవిలక్షణంగా 'షేక్‌ఫరీద్' అని పేరుపెట్టి అల్లారుముద్దుగా, అపురూపంగా పెంచుకొంటున్నారు.

ఇలావుండగా ఒకనాడు, దేవార్చనకోసం పూజాపుష్పాలు తీసుకువద్దామని శ్రీపతి బయలుదేరి అడవికి వెళ్ళాడు. అక్కడ పువ్వులు కోస్తూవుండగా గొప్పదైన విషసర్ప మొకటి అతనిని కాటువేసింది. శ్రీపతి గబగబ ఇంటికి చేరుకొని, స్నానంచేసికొని, భగవధ్యానంతో తులసితీర్థం పుచ్చు కొన్నాడు. భార్యను పిలిచి, జరిగిన వృత్తాంత మంతా చెప్పి, పరమార్థతత్వం ఉపదే శించాడు. మూడేళ్ల కొడుకును చేరదీసికొని, దీవించి, అటుతరవాత పరమేశ్వరుని సాన్నిధ్యం చేరుకొన్నాడు.

'విధివిలాసం తప్పదుకదా!' అనే సంగతి గుర్తుకు రాగా, శ్యామల దుఃఖం దిగమింగు కొని, బాలుణ్ణి ఐదేళ్ళవరకు జాగర్తగా పెంచింది.

షేక్‌ఫరీదు హరినామ సంకీర్తనలలో పాల్గొంటూ తండ్రిలాగానే మహా భక్తు డయ్యాడు. బాలభక్తుడైన ఫరీదు ఒకరోజున తల్లివద్దకు వచ్చి "అమ్మా! భగవంతుని అందరూ అనేకవిధాల వర్ణించి పొగడు తున్నారే? ఆయన నాకు కనబడడేమి?" అని ప్రశ్నించాడు. అందుకు తల్లి "బిడ్డా!— తపస్సు చేసినవారికి శ్రీహరి ప్రత్యక్ష మవుతాడని పెద్దలంటారు" అని చెప్పింది.

వై. దక్షిణామూర్తి




అంతట బాలభక్తుడైన ఫరీదు ప్రపంచ విషయాలన్నిటినీ వదలివేసి, అరణ్యాలకు పోయి, ఘోరతపస్సు చేయటానికని బయలుదేరాడు.

అలా బయలుదేరిపోతున్న తన ముద్దుకుమారునికి ప్రేమకొద్దీ తల్లి ఒక రొట్టెముక్క చేసియిచ్చింది. ఐతే, ఆ రొట్టెలో ఉప్పైనా వేయక, చప్పగా తయారుచేసింది. తల్లి యిచ్చిన ఆ రొట్టె ముక్కను నడుముకు కట్టిపెట్టుకొని ఫరీదు అరణ్యాలకు పోయాడు.

అక్కడ అతడు తీవ్రంగా తపస్సు ప్రారంభించాడు. ఆకలిబాధ ఎక్కువగా వుంటే తల్లి యిచ్చిన రొట్టె తినవచ్చుకదా అనుకొన్నాడు. కాని, ఆ సంగతే మరచి పోయాడు. తరువాత చెట్లఆకులు దూసుకొని అకటిబాధను మాన్పుకొంటూ, అలా ఎంతకాలమో తపస్సు చేశాడు. ఐనా, భగవంతుడు కానరాలేదు.

షేక్‌ఫరీదు పట్టు వదలక మరింత గాఢంగా తపస్సు చేయసాగాడు. కొన్నాళ్లకు ఒక వర్తకుడు ఏవోమూటలు బండిపైన వేసుకొని ఆ దారిన పోతూ, బడలిక తీర్చుకొందామని అక్కడ విశ్రమించాడు. ఫరీదు అతనిని కుశలప్రశ్నలు వేస్తూ, మూటలకేసి చూచాడు.

చూడగానే, 'అవన్నీ చక్కెర మూటలైతే ఎంతబాగుండును! నావద్ద నున్న రొట్టెకు అద్దుకు తినవచ్చుకదా' అని మనసులో ఒకభావం కలిగింది. కలిగి, 'మూటలలో ఏమున్నదండీ?' అని ఫరీదు అడిగాడు. ఇందుకు వికటంగా వర్తకుడు 'అవన్నీ ఇసుకమూటలయ్యా' అని బదులు చెప్పాడు. అటుతరువాత వర్తకుడు ఇంటికి పోయి, తీరా మూటలు విప్పిచూచుకునే సరికి ఇకనేముంది? వాని నోటివాక్యం ఫలించిందా అన్నట్టు ఆ మూటలలో అంతా ఇసుకే కానవచ్చింది!

వర్తకుడు గుండెబాదుకొంటూ, వెంటనే తన మూటలతోసహా ఫరీదు వద్దకు తిరిగివచ్చి, అతని కాళ్ళపైన పడ్డాడు. "మహాత్మా!— నా చక్కెర మూటలన్నీ ఇసుకమూటలుగా మారిపోయినై. నిన్ను వెటకారం చేసినందుకు తగినశాస్తి అయింది. నా అపరాధం క్షమించు" మంటూ వేడుకొన్నాడు. అందుకు ఫరీదు 'నాయనా!—నేనేమీ ఎరగనేయి' అంటూ ఎన్నోవిధాల వర్తకునికి నచ్చజెప్పాడు. ఎంత చెప్పినా అతడు నమ్మలేదు.

అప్పుడు ఫరీదు వర్తకునితో—"అయ్యా! నామాటచేతనే నిజంగా నీ చక్కెర ఇసికగా మారిపోయిందా? అలానే అయినట్టయితే, శ్రీహరి కృపవల్ల యిప్పుడు ఆ ఇసిక మళ్ళీ చక్కెరగా మారిపోవుగాక!' అని అనగానే ఆ ఇసికమూటలన్నీ మళ్ళీ చక్కెరగా మారిపోయినై. వర్తకుడు సంతోషించి, ఫరీదుకు కావలసిన చక్కెర యిచ్చి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత షేక్ ఫరీదు కఠిన నియమాలతో మళ్ళీ తపస్సు సాగించాడు. ఐనా శ్రీహరి దర్శనమీయులేదు. శ్రీహరి కృప కలగనందుకు విచారించి, ఫరీదు ఇంటికి మరలి పోయి, నిస్పృహతో తల్లినిచూచి



ఏడ్చాడు. తల్లి శ్యామల సంగతి అంతా తెలుసుకుని, కొడుకును తల నిమురుతూ, జడలుకట్టిన అతని తలనుంచి ఒక చిన్న జడ పట్టుకులాగింది. అప్పుడు ఫరీదు 'అమ్మా! ఇప్పటికే నేను సగం చచ్చి వున్నాను. నన్నింకా ఎందుకు బాధిస్తావు?' అని ప్రశ్నించాడు.

అందుకు తల్లి 'బిడ్డా!—ఒక్క చిన్న జడ పట్టుకు లాగితేనే నీకింత నొప్పి కలిగిందే, నీవు తపస్సుచేసే కాలంలో ఆహారంకోసం చెట్లనుండి ఒక్కొక్క ఆకూ దూసినప్పుడు వాటికెంత బాధ కలిగి వుంటుందో ఆలోచించావా? నీవు చేసిన

తపస్సు హింసతో కూడుకొన్నది. పైగా నీవు, తపస్సు చేస్తున్నా కూడా నీకు రొట్టెమీద చక్కెర రుచీ మనసులో మెదులుతూనే ఉన్నవాయె! అటువంటప్పుడు భగవంతుడు నీకు ఎలా ప్రసన్నుడవుతాడు?' అని అన్నది.

ఆ వెంటనే ఫరీదు, తల్లి ఉపదేశం ప్రకారం మళ్ళీ అడవులకు పోయి, కదలక మెదలక, ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ, కొయ్యబారిపోయినా దీక్ష మానక తపస్సు సాగించాడు.

అప్పుడు భగవంతుడు సాక్షాత్కరించి, కృపచూపుతూ "వత్సా!—నీ వింటికిపోయి, సద్గురువులను ఆశ్రయించి వారి అనుగ్రహం సంపాదించు. నేను ఎల్లప్పుడూ నీకు సన్నిహితుడనయే వుంటాను" అని పలికి అంతర్హితుడయ్యాడు.

షేక్ ఫరీదు వెంటనే యింటికిపోయి, జరిగినదంతా పూసగుచ్చినట్టు తల్లికి వినిపించాడు. తల్లి ఎంతగానో సంతోషించింది.

అటుపిమ్మట షేకుఫరీదు ద్వారక మొదలైన తీర్థస్థలాలు సేవించుకొంటూ, భగవద్భక్తుల దివ్యదర్శనం చేసుకొంటూ, కొంతకాలానికి మళ్లీ ఇల్లుచేరుకొని తల్లితోకూడా సుఖంగా ఉంటూవుండగా—

ఆదేశపు రాజు ఫరీదు ఇంటికి వచ్చి, తనకు జన్మాంతర పాపఫలంవల్ల కలిగిన ఒక వ్యాధిని పోగొట్టుమని వేడుకొన్నాడు. షేక్ ఫరీదు ఆ రాజును ఆపాదమస్తకమూ తన చేతితో తడవగా, ఆ క్షణమందే అతనికి వ్యాధి నయమైపోయింది.

ఇందుకు ఆ రాజు ధన కనక వస్తువాహనాలతో ఫరీదును గౌరవించబోగా ఫరీదు వద్దన్నాడు. 'అయితే నేను ఇక్కడే ప్రాణత్యాగంచేస్తా' నని భీష్మించాడు రాజు. ఆరాత్రి పాండురంగడు ఫరీదుకు దర్శనమిచ్చి, ఆజ్ఞయివ్వగా, రాజు ఇచ్చే ధనాన్ని స్వీకరించి ఆ ధనంతో భాగవతులకు సమారాధనలు జరిపించాడు.



# మెరుపుల దొంగ

బ్రిటన్ దేశంలో ఒక చిత్రమైన పక్షి వున్నది. రూపానికి మన కాకిని పోలి వుంటుంది. అది సంఘంలో కలివిడిగా మసిలే గుణంకలది. ధ్వని అనుకరించటంలో దానికి మంచి నేర్పున్నది. అలవాటుచేస్తే అది సరీగా మనిషిలాగానె మాటాడగలదు. ఈ పక్షి పేరు 'జాక్‌డా'.



జాక్‌డా విషయంలో చెప్పుకోతగ్గ చిత్రమేమిటంటే: మెరిసే వస్తువులు చూస్తే దానికి ఎక్కువ మోజు. ఏమూలని ఏపాటి మెరిసినా, అది వెతుక్కుంటూ పోయి ఆ వస్తువును పట్టి తెచ్చి, తన గూటిలో పెట్టుకొంటుంది.

ముఖ్యంగా నాణాలనుగురించి ఆ దేశస్థులు ఎక్కువ జాగరూకతతో మసులుకుంటారు. ఏమంటె—మెరిసే నాణాలు కంటబడితేచాలు, ఈ జాక్‌డా పక్షి ఎత్తుకు చక్కాపోతుంది. ఎన్నోచోట్ల, జాక్‌డా గూళ్లు వెతికిచూడగా వాటిలో ప్రత్యక్షంగా నాణాలు కనిపించినై. అందుచేతనే ఈ దొంగపక్షిని ఆ దేశస్థులు నమ్మక, ఒక కంట కనిపెట్టేవుంటారు. ఈ దొంగపక్షి మెరిసేవస్తువులను పట్టుకపోయి అక్కడా ఇక్కడా పెట్టటంచేత చాలామంది అమాయకులు చోరీఆస్తి అట్టిపెట్టుకున్నారనే నేరానికి గురికావడం కద్దు. చదువుకొనే వారి కళ్లనుండి ఇది కళ్లజోడుకూడా ఎత్తుకపోతుంది.

మరొక వింత వున్నది: నిప్పు మెరుస్తుందీకదా! కనుక, నిప్పుతో వున్న చిన్న చితుకులు ఇది ముక్కున కరచి పట్టుకుపోయి ఏ యింటి నడికొప్పు మీదనో పెడుతుంది. ఇందువల్ల కొంపలు కాలిపోతూవుంటయి.

జాక్‌డాకు గొప్ప ఓరిమీ, నిదానమూ ఉన్నది. గూడుకోసం చిన్న చితుకులు తెచ్చి, ఒకొక్కటె చక్కగా పొందికగా పేరుస్తుంది. గుట్టలు, బొరియలు, పాడు గోడలు, చెట్టుతొర్రలూ ఈ పక్షికి నివాసస్థలాలు. ఈ పక్షులు గొర్రెలపైన వాలి, గూటి సదుపాయంకోసమని వాటి ఉన్ని లాగుతూవుంటాయి.



# గూని గుఱ్ఱం

ఒక రైతుకు ముగ్గురు కొడుకులు. పెద్ద వాళ్లిద్దరూ చురుకైనవాళ్ళు. మూడోవాడు మందమతి. ఎప్పుడూ గోళ్ళుగిల్లుకుంటూ కూచునేవాడు.

ఒకనాడు రైతు తన కొడుకులను పిలిచి పొలం నాటిరమ్మన్నాడు. పెద్దవాళ్ళిద్దరూ పొలానికి వెళ్ళి నాట్లువేసి వచ్చారు. మంద మతి గోళ్లుగిల్లుకుంటూ ఇంటివద్దే ఉండి పోయాడు.

కొన్నాళ్ళకల్లా విత్తనాలు మొలకలెత్తి మొక్కలు ఎదగసాగాయి. ఒకనాడు రైతు వెళ్ళి పొలం చూడబోయేసరికి నారు నాశనమైపోయివుంది. ఏదో జంతువు పొలం కాస్తా తొక్కేసినట్టుంది. రైతుకు మండి పోయింది. కొడుకులను పిలిచి మళ్లా పొలం నాటి జాగర్తగా కాపలాకాయమన్నాడు.

పెద్దకొడుకులిద్దరూ పొలం మళ్ళీ నాటారు. మొక్క పెరగసాగింది. ఒక రాత్రి పెద్దవాడు కాపలావెళ్ళాడు. వాడు చాలా సేపు మేలుకొని ఉన్నాడు. కాని వానికి ఒక రాత్రివేళ నిద్ర ముంచుకువచ్చింది. తెల్లారు జామున వాడు లేచేసరికి పొలమంతా తొక్కేసి నాశనమై ఉన్నది.

పెద్దకొడుకులిద్దరూ మళ్లీ పొలం నాటారు. పైరు పెరిగేటప్పుడు రెండోకొడుకు కాపలా వెళ్ళాడు. వాడూ ఒకరాత్రివేళ నిద్రపోయాడు. తెల్లవారేసరికి పొలం తొక్కేసి, నాశనమై ఉన్నది.

ఈసారి వాళ్లు పాడైన మళ్ళుమాత్రమే నాటారు. పొలానికి కాపలా కాయుటం ఈసారి మందమతి వంతు వచ్చింది. వాడు పొద్దు పోకమునుపే పడుకుని నిద్రపోయే ఏర్పాట్లు చూసుకున్నాడు. చెట్లకొమ్మలు కొట్టితెచ్చి పక్క పరుచుకున్నాడు. దానిమీద పడుకుని కళ్లు మూసుకున్నాడు. కాని కొమ్మలు ముళ్లలాగా గుచ్చుకుని, వాడికి నిద్రపట్టిందే

కుమారి సి. జానకి

కాదు. పక్క సరిగ్గా చేసుకుందామని లేచే సరికల్లా పొలంలో ఒక గుర్రం కని పించింది.

"ఓహో, మా పొలం పాడుచేస్తున్నది నీవేనా? నీ పని చెబుతానుండు," అంటూ మందమతి చల్లగా వెనుకపాటునే వెళ్ళి దానిమీద పడ్డాడు. ఇంతలో గుర్రం ఆకాశంలోకి ఎగిరింది. అయితే మంద మతికి దాని తోక చిక్కింది. దాన్ని వాడు గట్టిగా పట్టుకున్నాడు. వదలలేదు.

గుర్రం గాలిలో పోయిపోయి మూడు సముద్రాల అవతల నేలకి వాలి, "నన్ను వొదిలిపెట్టు. నేనిక ఎన్నడూ మీ చేను జోలికి రాను," అన్నది.

"నిన్ను నమ్మను. నీవు మాకు చాలా నష్టం కలిగించావు, దానిమాట యేమిటి?" అన్నాడు మందమతి.

ఆ నష్టానికి పరిహారంగా నా పిల్లలను ఇచ్చుకుంటాను," అన్నది గుర్రం.

"ముందు నన్ను మా ఇంటికి చేర్చు. తరువాత చెబుతా" అన్నాడు మందమతి.

ఆ గుర్రం మందమతిని తన వీపున ఎక్కించుకు పోయి ఇంటివద్ద దించింది.

"నా పిల్లలను తెచ్చి ఇచ్చేదాకా నా కళ్ళెం దగ్గర పెట్టుకో" మని చెప్పి గుర్రం




ఎగిరిపోయింది. ఈ సంగతులేవీ మందమతి తన తండ్రితో చెప్పలేదు.

వాడు ఆ నాటినుంచి అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి గుర్రపుపిల్లలకోసం కొట్టం తయారుచేయసాగాడు. ఈసారి పొలం పాడు కాకుండా ఉండటం చూసి తండ్రి చాలా సంతోషించాడు.

కొట్టం తయారయేసరికల్లా మూడు గుర్రపుపిల్లలూ వచ్చాయి. అందులో రెండు పిల్లలు చాలా అందమైనవి. వాటి గిట్టలు వెండివి. వాటి శరీరాలు బంగారు రంగువి. మూడవదానికిమాత్రం రెండు మూపురాలు ఉన్నాయి. వాటిమధ్య జీను లేకుండానే




కూర్చుని సవారీ చేయవచ్చు. ఇదంటే మందమతికి ఎంతో మక్కువ.

తమ తమ్ముడు ఎక్కడో మంచి గుర్రాలను సంపాదించాడని కనిపెట్టి అన్నలిద్దరూ ఒక ఆలోచన చేశారు. 'ఈ గుర్రాలను రాజుగారికి అమ్మితే చాలా డబ్బు వస్తుంది' అని వారు మందమతితో చెప్పారు. ఆ ప్రకారం ముగ్గురూ మూడు గుర్రాలూ ఎక్కి రాజుగారి కోటకు వెళ్ళారు.

బంగారు గుర్రాలను చూసి రాజు చాలా ముచ్చటపడి 'అబ్బాయిలూ?-ఈ గుర్రాల వెల ఎంత?' అని అడిగాడు. అందుకు బదులుగా "వెల ఎంతని చెప్పగలం? మీ



ఇష్టం వచ్చినట్టు ఇవ్వండి," అన్నాడు మందమతి. ఈ గుర్రాలను చూడగానే రాజుగారి కాసావాడు, "అమ్మో, ఇంత గొప్ప గుర్రాలను సాకటం నావల్ల కాదు. వీటిని తెచ్చినవాడినే చూచుకోమనండి," అన్నాడు.

మందమతికి సంతోషమయింది. "నేను కూడా ఇక్కడే ఉండిపోయేపక్షంలో ఈ గుర్రాలను రాజుగారు ఉత్తనే తీసుకోవచ్చు," అనేశాడు. ఇందుకు రాజు మరింత సంతోషించాడు. మందమతి అన్నలకు కొంత డబ్బు ఇప్పించి పంపేశాడు.

ఇలా వుండగా, ఒకనాడు రాజుగారు మందమతిని పిలిచి, "నీవు చాలా శక్తిమంతుడవల్లే ఉన్నావు. నాకు సాగరరాజ కుమారిని పెళ్ళాడాలని ఉన్నది. ఆమెను నాకు తెచ్చి యివ్వాలి," అన్నాడు.

సాగరరాజెవరో, ఆయన కుమార్తె ఎక్కడున్నదో మందమతికేం తెలుసు? ఏవో వంకలు చెప్పి తప్పించుకోజూశాడు.

రాజుకు కోపం వచ్చింది. "నీవీ పని చేయకపోతివా, ఇదిగో చూచావా కత్తి! పుచ్చె ఎగిరిపోగలదు, జాగర్త," అన్నాడు.

మందమతి విచారంతో తన గూనిగుర్రం దగ్గిరికి పోయి తనకు వచ్చిన ఇబ్బంది చెప్పుకొన్నాడు.



"ఇదేమంత పెద్ద విషయం, విచారించటానికి? సాగరరాజకుమారికి బహుమానంగా యివ్వటానికి దివ్యమైన ఫలహారాలు రాజుగారిని అడిగి పుచ్చుకో. తరువాత సంగతి చెబుతా"నన్నది గుర్రం.

అదేప్రకారం దివ్యమైన ఫలహారాలు రాజునడిగి తెచ్చి, మందమతి తన గూని గుర్రంపైన ప్రయాణమైనాడు. అది ఆకాశంలోకి ఎగిరిపోయి మూడు సముద్రాలు దాటి సాయంకాలానికల్లా నాలుగో సముద్ర తీరాన వాలింది.




అక్కడ మందమతి డేరా వేయించి, అందులో ఫలహారాలన్నీ అమర్చి సాగర రాజకుమారికోసం కనిపెట్టుకుని ఉన్నాడు.

కొంచెంసేపటికల్లా సముద్రం పొంగింది. పెద్దపెద్ద అలలు ఆకాశంలోకంటా లేచాయి. వాటిమీదుగా వచ్చి సాగర రాజకుమారి ఒడ్డుకు చేరుకున్నది. డేరా చూచింది. ఫలహారాల పరిమళం ఆమెకి సోకగానే లోపల ప్రవేశించి, ఇష్టమైన పదార్థాలు తినసాగింది. నిజానికి, అక్కడ వున్న పదార్థాలన్నీ ఆమెకు ప్రియమైనవే!

ఇంతవరకూ చాటున పొంచివున్న మందమతి వెనుకపాటునే వచ్చి ఆమెను పట్టివేశాడు. ఆమె తప్పించుకుని పోయే లోగా ఆమెను తన గూనిగుర్రం ఎక్కించుకొని ఆకాశమార్గం పట్టాడు.

సాగర రాజకుమార్తెను చూడగానే రాజు చాలా సంతోషించి తనను పెళ్ళాడుమని ఆమెను కోరాడు.

"అలాగే చేసుకొంటా. కాని నాకొక వ్రతం ఉన్నది. ముందు నన్నిక్కడికి తెచ్చిన కుర్రవాడిని తెర్లే పాలలో స్నానం చేయించాలి" అన్నది సాగరరాజు కూతురు.

"దానికేం భాగ్యం?" అన్నాడు రాజు. ఆయన మందమతిని పిలిపించి తెర్లేపాలలో అతనిని స్నానంచేయమని శాసించాడు. లేకపోతే పీక తెగిపోతుందన్నాడు.





మందమతి ఖిన్నుడై పోయి, మళ్లీ గూని గుర్రంతో తన గొడవ వలపోసుకొన్నాడు.

"దీనికేనా భయం! 'అలాగే' అని వప్పుకో. తరువాత సంగతి నే చెబుతా" అన్నది గుర్రం.

మందమతిని ఉడుకుపాలలో స్నానం చేయించడానికి ఏర్పాట్లు పూర్తి అయాయి. పెద్ద గంగాళంనిండా పాలుపోసి, గంగాళం కింద కట్టెలు మంటపెట్టి, పాలు తెర్లేలాగు కాచారు. అందులోకి దిగడానికి మంద మతిని తెచ్చారు.

ఈ సమయంలో గూనిగుర్రం ఎవళ్లకూ తెలియకుండా పాల మీద గాలివిడుస్తూ వుంది. దాని గాలికి కాగుతున్న పాలన్నీ మంచులాగా చల్లబడిపోతూ వచ్చాయి.

మందమతి పాలలో వేలుపెట్టి, "ఎబ్బే, ఏమిటి, ఈ పాలు ఇంత చల్లగా ఉన్నాయి! ఇంకా బాగా మంటవేయండి," అన్నాడు.

రాజభటులు గంగాళంకింద ఇంకా కట్టెలుపెట్టి మంటవేశారు. రాజు చూస్తూ ఉండగానే మందమతి గంగాళంలోకి దిగి, సలసల కాగే ఉడుకుపాలలో ఓలలాడాడు.

సాగరరాజకుమార్తెకేసి తిరిగి, రాజు "నీ కోరిక తీరిందా? మరి, నన్ను పెళ్ళి చేసుకో!" అన్నాడు.

"అలాగే చేసుకొంటా. ఐతే, నాకు నా పెళ్లిదుస్తులు కావాలి. అవి ఉంటేగాని వీలులేదు," అన్నది సాగరరాజకుమార్తె.

"దర్జీవాళ్లని పిలిపిస్తా. కోరిన దుస్తులు కుట్టిస్తా," అన్నాడు రాజు.

"అలా కాదు. నా పెళ్లిదుస్తులు మా అన్నదగ్గిర ఉన్నాయి. మా అన్న చంద్ర లోకంలో ఉన్నాడు," అన్నది సముద్ర రాజకుమార్తె.

మళ్ళీ మందమతికి పని తగిలింది. చంద్రలోకానికి వెళ్లి సముద్ర రాజకుమార్తె పెళ్ళిదుస్తులు తీసుకురాకపోతే రాజు మందమతి తల తీసేస్తానన్నాడు.

మందమతి తన గూనిగుర్రాన్ని ఎక్కాడు. ఆకాశమార్గాన ఎన్నో రోజులు ప్రయాణంచేశాడు. చివరకు చంద్రమండలం చేరుకొన్నాడు. సాగర రాజకుమార్తె అన్నను కలుసుకొని ఆమె పెళ్ళి దుస్తులు చేతపట్టుకొని చక్కావచ్చాడు.

"సరే. నా అటంకమేమీ లేదిప్పుడు. మనం పెళ్ళాడటమే తరువాయి. ఐతే, మా కులాచారంప్రకారం నీవుకూడా ముందు పాలలో జలకమాడి రావాలి," అన్నది రాజుతో సాగరరాజకుమార్తె.

'నేనా?' అన్నాడు రాజు నిర్ఘాంతపోయి.

"చిటికలో ఆ మందమతి చేసిన పని మీరు చేయలేరా?" అని వెటకారం చేసింది సాగర రాజకుమార్తె.

రాజుకు పౌరుషం వచ్చి, వెంటనే గంగాళంలో పాలు కాయించాడు. పాలు తెర్లేటప్పుడు రాజు అందులో వేలు పెట్టి చూచాడు. పెట్టీపెట్టడంతోనే శోకాలు ప్రారంభించాడు. అప్పుడు రాజును చూచి, "మందమతి మీలాగే శోకాలు పెట్టాడా? ఇంకా మంటలు వెయ్యమన్నాడు. నవ్వుతూ పాలలో స్నానంచేశాడుగా!" అన్నది సాగర రాజకుమార్తె.

రాజుకు పౌరుషం హెచ్చయింది. నిచ్చెన తెప్పించి గంగాళంమీదికంటా యెక్కి గభీమని పాలలోకి దూకాడు! ఇంకేముంది? రాజుపని ముగిసేపోయింది !!

అప్పుడు సాగరరాజకుమార్తె మందమతిని పెళ్ళాడతానంది. ఆ ముహూర్తానికే మందమతిని పెళ్ళికొడుకును చేశారు. అతనికీ సాగరరాజకుమార్తెకూ అతి వైభవంగా పెళ్ళి జరిగింది.

ఆ దేశానికి మందమతే రాజయాడు. అతని పరిపాలన ప్రజలకు సుఖంగానే ఉంటూవుంది. ఐతే, ప్రజలుమట్టుకు తమ రాజును ఎన్నడూ 'మందమతి' అని పిలిచియెరగరు.



# 9 మాహాత్మ్యం

(1) నీ స్నేహితుణ్ణి ఇష్టం వచ్చిన ఒక అంకె తలుచుకోమను. దానిని 9 పెట్టి గుణించమను. గుణించగా వచ్చిన మొత్తానికి అతను తలుచుకున్న అంకె కలిపి, అలా కలపగా వచ్చే మొత్తమెంతో నీకు చెప్పమను. ఇప్పుడు నీ స్నేహితుడు తలుచుకొన్న అంకె ఏదో చిటికలో చెప్పేసుకోగలుగుతావు. ఎలా అంటే :

| | | |
|---|---|---|
| నీ స్నేహితుడు తలుచుకున్న అంకె ... | 73 | అనుకుందాం. |
| దానిని 9 పెట్టి గుణిస్తే ... | 9 | |
| | 657 | |
| దీనికి 73 కలుపు ... | 73 | |
| | 730 | మొత్తం. |

ఇప్పుడు ఈ మొత్తంలో సున్న మినహాయించగా మిగిలిందే నీ స్నేహితుడు తలుచుకున్న అంకె అన్నమాట. అనగా—73(0) = 73 ఇది నీవు తడుము కోకుండా చెప్పవచ్చు.

—నిమ్మగడ్డ రాధాకృష్ణరావు: ఉయ్యూరు

(2) 9..కి సంబంధించిన భాగహారంలో ఒకకొత్తచిత్రం :

| | లబ్ధం | శేషం | | లబ్ధం | శేషం |
|---|---|---|---|---|---|
| $10 \div 9 =$ | 1 | 1 | $50 \div 9 =$ | 5 | 5 |
| $20 \div 9 =$ | 2 | 2 | $60 \div 9 =$ | 6 | 6 |
| $30 \div 9 =$ | 3 | 3 | $70 \div 9 =$ | 7 | 7 |
| $40 \div 9 =$ | 4 | 4 | $80 \div 9 =$ | 8 | 8 |

—ఎస్. కల్యాణరామన్, పెనుకొండ

(3) ఏదైనా 3 అంకెలుగల సంఖ్య తీసుకో. మొదటి అంకె చివరి అంకెకంటే ఎక్కువగా ఉండాలి. నీవు వేసిన సంఖ్యను తిరగవేసి, మొదటి సంఖ్యలో నించి తీసివెయ్యి. వచ్చిన శేషంలో మొదటి అంకె, చివరి అంకె కూడితే 9 వస్తుంది. మధ్య అంకెకూడా 9 ఐవుంటుంది. ఇందుకు రెండు ఉదాహరణలు :

| | |
|---|---|
| 895 | 747 |
| 598 | 647 |
| 297 | 099 |
| 2 + 7 = 9 | సున్నకు విలువలేదు కనుక |
| మధ్యసంఖ్యకూడా 9. | చివరి సంఖ్య 9. మధ్య సంఖ్య 9. |

—ఎస్. నాగరాజన్, సేలమ్




అది పౌరుషశాలి మహారాణాప్రతాప్ పరిపాలించే కాలం. అక్బరుపాదుషా మనకు చక్రవర్తిగా వచ్చిన కాలం. సామంతులందరూ చక్రవర్తికి లొంగారు. ప్రతాప్ మట్టుకు లొంగిరాలేదు. అక్బరుక్రోధపూరితుడైనాడు. రాణా పట్టుదల వహించాడు.

రాణా చూపె స్వాతంత్ర్యేచ్ఛను అక్బరు సహించలేకపోయాడు. కష్టాలెన్నో కల్పించాడు. రాణా కసుగందలేదు.

చక్రవర్తికి ఎదురుపుట్టింది. ఐనా రాణాను సాధించితీరాలెనని నిశ్చయించాడు. రాణాలోని స్వాతంత్ర్యజ్వాల మరింత విజృంభించింది. ఆఖరుకు చక్రవర్తి కార్పణ్యంవహించి మహారాణాను అడవుల పాలు చేసివేశాడు!

ఒక్క తనప్రాణమే ఐతే, రాణా లెక్క చేయకపోను. తనతోపాటు కట్టుకొన్న భార్యా, కన్న బిడ్డలు కష్టపడవలసిరావటం ఆతనికి హృదయశల్యమై వేధించింది. 'చక్రవర్తి చేతికింద బానిసగా వుండటమా? అడవులలో స్వతంత్రమైన గాలి పీల్చుకోవటమా?'—ఈ సమస్యతో రాణా మనస్సు వేగిపోయింది. రెండవమార్గమే మంచిదని ఎంచుకొన్నాడు. రాణామాత్రమే కాదు. ఆయన సతి సుగుణాంబ, పదకొండేళ్ల పుత్రి చంపావతి, నాలుగేళ్ల నిసుగు సుందరసింగూ—అందరకూ ఈ మార్గమే ఇష్టమయింది. నాటినుండీ రాణా కుటుంబం అడవులలో తలదాచుకొంటూ అజ్ఞాతంగా కాలక్షేపం చేయసాగారు.

బిడ్డలిద్దరూ లోకంమరచి అడవులలో ఆడుకొనేవారు. చంపావతి పువ్వులదండలు గుచ్చి చిట్టితమ్ముని మెడలో వేసి ఆనందించేది. ఒకనాడు పాపం పసివాడు, అకలికి ఓర్వలేక రాగాలు పెట్టాడు. అప్పుడు చంపావతి "తమ్ముడూ! ఈపాటి

ఎమ్. ఎస్. శాస్త్రి



దానికేనా ఏడుపు!" అంటూ ఊరడించి కుటీరంలోపలకు ఎత్తుకుతీసుకవెళ్ళింది.

* * *

మహారాణా ప్రతాప్, ఆయన సతీమణి సుగుణాంబా ముతుకగుడ్డలు ధరించి, దీనవదనాలతో కూర్చునివున్నారు. ఉండి వుండి ప్రతాప్ పెద్దగా నిట్టూర్చాడు. 'సతీ! చూచావా విధివిలాసం? ఒకానొక బ్రాహ్మణుడు మన ఇంటికి అతిథిగా వచ్చి, ఉత్త చేతులతో మరలిపోవటమా!—ఇటువంటి సంఘటన కలగటం నా జీవితంలో ఇదే మొదటిసారి. రాజస్థానానికంతటికీ మకుటాయమానంగా వెలిగిన మన చిత్తూరు ప్రభువులకే తలవంపుకదా ఇది? ఛీ!—జాతికే మచ్చతెచ్చిన నేను బ్రతికేం, చచ్చేం!' అని వాపోతూ సొలిపోయాడు.

భర్తకు సుగుణ అనేక వుపచారాలు సలిపింది. కొంచెం తేరుకొన్నాడు. "ఇంత వరకు ఏ విషయమూ నా కింతటి దుఃఖాన్ని కలిగించలేదు సుగుణా! నెలలతరబడి పస్తులున్నా నాకు బాధ కలగలేదు. మన అక్షయుడు ఆకటిబాధతో చచ్చిపోయినా నేను పట్టించుకోలేదు. 'అన్నమో! అన్నమో!' అని విలపిస్తూ మన స్వర్ణ మనలను వీడినప్పుడూ నేను ధైర్యం వదలలేదు. కాని—కాని...యీ నాడు...ఒక బ్రాహ్మణుడు నా కుటీరంనుండి ఆకటి పొట్టతో వెళ్ళిపోవలసి వచ్చిందంటే...యెంత అవమానం! ఎంత శిరచ్ఛేదం!!"—ఇలా అంటూ మళ్ళీ స్మృతితప్పి పడిపోయాడు.

* * *

అంతలో చంపావతి తమ్ముని వెంట బెట్టుకుని తండ్రిపద్దకు చక్కావచ్చింది. "దిగులుపడకండి నాన్నగారూ! మీ రను కొన్న బ్రాహ్మడు ఉత్తచేతులతో వెళ్లిపోలేదు. స్నానానికి వెళ్లాడు. ఇప్పుడే తిరిగి వస్తాడు. ఆయనకు భోజనంపెట్టి పంపించే బాధ్యత నాది" అని ధీమాచెప్పింది.

అశ్చర్యపోయాడు రాణా. చంపావతిని చేరదీసికొన్నాడు. "నా కీర్తి నిలబెట్టావు చిట్టి తల్లీ!–అవునుగాని, బ్రాహ్మణ్ణి ఎలా తృప్తి చేస్తావమ్మా ? నాకేమీ బోధపడటంలేదు!" అని ఆత్రంతో అడిగాడు.

"నాన్నగారూ!—రెండు రోజులనుండీ నావంతు రొట్టెలు అలానే వుండిపోయాయి. అవి ఆయనకు వడ్డిస్తా. ఆయన తిరిగివచ్చే లోపల, మనకు అడవిలో దొరికే ఆకులతో అధరువుకూడా తయారుచేసివుంచా. ఇంక భయమెందుకు నాన్నగారూ!" అన్నది.

మహారాణా కన్నులనుండి అప్రయత్నంగా బాష్పాలు రాలినై.

* * *

స్నానం చేసుకువచ్చాడు బ్రాహ్మడు. కూర్చునేందుకు చదర వేసేవుంచింది చంపావతి. ఆయన కూర్చోగానే రొట్టెలు వడ్డించి, పచ్చడి వేసింది. ఆప్యాయనంగా ఆరగిస్తున్నాడు బ్రాహ్మడు. "స్వామీ!—అడవులలో ఉండేవాళ్లం. ఇంతకంటే యేమీ చేసిపెట్టలేకపోయాం" అన్నది చంపావతి, వినయం ఉట్టిపడుతూ.

"అమ్మా!—అలా అనుకోవద్దు. ఇంత తృప్తికరమైన భోజనం నేను నా జీవితంలోనే ఎరగను. సుఖంగా వుండు తల్లీ!–"



అంటూ దీవించి వెళ్ళిపోయాడు బ్రాహ్మడు. ఈ వార్త తండ్రికి చెబుదామని లోపలికి వెళ్ళింది చంపావతి. కాని నీరసంచేత సోలిపోయింది. నోటమాటే లేకపోయింది.

* * *

రాణా వచ్చిచూచాడు. సుగుణవతి పక్కన కూర్చుంది. తల్లడిల్లిపోయాడు రాణా. ఆయన మనసు వికలమైపోయింది. "సుగుణా!–దయగల పాదుషా కబురు పంపాడు, రాజీకి రమ్మని..." అన్నాడు.

అంతలో బయట అడుగుల చప్పుడయింది. 'పాదుషామనుషులే ఐవుంటారు' అన్నాడు మళ్ళీ రాణా, కొత్త జవంతో.

వణుకిపోతున్న పెదవులతో, కంపించిపోతున్న శరీరంతో చంపావతి గభీమని లేవబోయింది. లేవలేక పడిపోయింది. "నాన్నగారూ? పాదుషా దయ ఇప్పుడాతెలిసి వచ్చింది మీకు? రేపు తన ఆస్థానంలో పెద్ద ఉద్యోగమిస్తాడు. ఎల్లుండి మళ్ళీ బానిసగా చేసుకొంటాడు. ఇదేనా మీతృప్తి? రాజపుత్ర పౌరుషం మంటకలిసిపోవటమేనా? వంశ గౌరవం నాశనంచేస్తారా నాన్నా? హల్దీఘాట్ యుద్ధంలో 'రాణాబిడ్డలు సింహపు కొదమలుసుమా' అని అక్బరుకు మచ్చు చూపించాముకదా. ఈనాడు రాజీఅనేపలలో రాణా పడ్డాడంటె సిగ్గుచేటుకదా!" అని ఆవేశంతో గబగబ పలికి, పడిపోయింది!!! పడిపోవడమేమిటి? స్మృతి తప్పిపోయింది.

వలవల ఏడ్చాడు రాణా. "అమ్మా! చంపా!!–అటువంటి నీచానికి రాణా ఒడంబడడు, నమ్మ. నీ బాధ చూడలేకనె అలా తప్పుడుమాట లన్నాను. నిశ్చింతగా ఉండు తల్లీ! అక్బరుకు యెన్నడూ లొంగను నమ్మ!!" అనగానే, చంపావతి శాశ్వతంగా కన్ను మూసింది!!!

అంతలో బయటనుండి "నిజం, నిజం! అక్బరుకు లొంగకూడదు!!" అని ఒక వాణి వినిపించింది. రాణా విస్మయంతో చూచేటంతలో బ్రాహ్మడు మళ్ళీ వచ్చాడు.

రాణాచేతిని తనచేతిలో ఉంచుకొన్నాడు. చంపావతిని చూచి బొటబొట కన్నీళ్లు రాలుస్తూ "రాణా!—పరమ పవిత్రమైన ఈపువ్వు రాలిపోవటానికి కారణమైన మహాపాపి వీడే. వీడే అక్బరు. ఈమెపేరు స్వర్ణాక్షరాలతో అప్పుడే చరిత్రకు ఎక్కిపోయింది. నీకుగాని నాకుగాని ఇంతకంటె కావలసిందేమిటి? ఈ చంపావతి సమక్షమందు దేవునిసాక్షిగా చెబుతున్నా: ఇంతటినుండి మనకు వైరం లేదు. నీ రాజ్యం నీవు నిశ్చింతగా ఏలుకో!" అంటూ రాణాను ప్రేమతో చేరదీసుకొన్నాడు.



# నలుమూలల నడకలు



ఒకగ్రామంలోకి ఒక కోతి వచ్చింది. పెంకెపిల్లవా డొకడు వెక్కిరించాడు దానిని. అదీ వెక్కిరించింది. పిడికిలితో నెత్తిమీద చరుపు చరిచాడు, కోతీ వానిని చరిచింది. వాడు ఆలోచించాడు 'ఈ కోతి నేను చేసినట్టే ప్రతిపనీ చేస్తున్నది. దానికి తోక వుంది, నాకు లేదుగా? దాని తోక మెలిపెడతా, అప్పుడవేం చేస్తుందో చూస్తా' అని ధీమాపడ్డాడు. ఈ ధీమాతో తోక మెలి పెట్టాడు. అది వానిపైనబడి కరిచింది.



ఒక విజ్ఞానవేత్త దేశమంతా సంచారం చేసి తన ఊరికి వచ్చాడు. ఊరిలో గొప్ప సభ ఏర్పాటుచేశారు. "నేను కాశ్మీర్ దేశానికి వెళ్లాను. నేను పట్టుకువెళ్ళిన పాత్రలో నెయ్యి రాయిలాగా గడ్డకట్టుకుపోయింది. చెంచాతో తీయబోతే, చెంచా విరిగి ముక్కలయింది. కత్తితో తీశాను, కత్తికూడా వంగిపోయింది. అంతటి చలిదేశం అది!" అని చెప్పేటంతలో సభలో ఒకడు లేచి, "అయ్యా, మీరు చెప్పినదాన్ని బట్టిచూస్తే, మీ మెదడుకూడా గడ్డకట్టిపోయివుంటుందని తోస్తుంది" అన్నాడు, తాపీగా.

'ఏపాటి సామాన్యుడైనా ఇంగ్లీషుదొర ఇండియాలో అధికారిగా వచ్చేటప్పటికి గొప్ప సమర్థుడవుతాడు. నిజంగా ఇది ఆశ్చర్యంకదూ?' అని ఒక దొర హిందూ రాజకీయవేత్తను అడిగాడు.

అందుకు రాజకీయవేత్త ఇలా చెప్పాడు: 'ఇంతకంటె ఆశ్చర్యకరమైన విషయం ఉన్నది. మా దేశంలో పనికిమాలిన రాతిని విగ్రహంగా చెక్కేటప్పటికల్లా దానికి ఎక్కడలేని పూజ్యతా కలుగుతుంది సుమండీ!'



ఒక మహారాజుకింద ముప్ఫయిద్దరు సామంతులు. ఆ మహారాజు సుఖంగానే ఉండేవాడు కాని, సామంతులు ఎప్పుడేం చేసిపోతారో అని భయంగా వుండేది. ఒకప్పుడు ఒక జ్ఞాని ఆయన ఆస్థానానికి విచ్చేయగా, మహారాజు తన భయాన్ని వెల్లడించాడు. అప్పుడా జ్ఞాని "రాజా!—భయమెందుకు? ముప్ఫయిరెండు పండ్ల మధ్యని నాలిక ఎలా మసులుకొంటున్నది? అదేవిధంగా నీవూ తెలివితేటలుకలిగి మసులుకో!" అని బోధచేశాడు.



# పడవ నడిపే వాడు

గాంధారదేశంలో కుబేరగుప్తుడు అనే గొప్ప వర్తకుడు ఉండేవాడు. అతడు కొస్తా వ్యాపారం చేసి, కోట్లకు పడగలెత్తాడు.

గుప్తుడికి ఒక్కగానొక్క కొడుకు కీర్తి సాగరుడు. చిన్నవాడు అందచందాలకే గాక, ధైర్యసాహసాలకూ తెలివితేటలకూ కూడా పేరుపొందాడు. పైగా, జాలిగుండె కలవాడు. కీర్తిసాగరుడు పెరిగి పెద్దవాడయేసరికి గుప్తుడికి వృద్ధాప్యం వచ్చేసింది. అందుచేత, కుబేరగుప్తుడు కొడుకును చేరపిలిచి, వ్యాపారమంతా వానికి పప్పగించాడు.

ఒకరోజున కీర్తిసాగరుడు కొస్తాకు వెళ్లి వద్దామని అన్ని సన్నాహాలు చేసికొన్నాడు. పడవలనిండా రకరకాల దినుసులు సిద్ధంగా ఉన్నాయి. కావలసినంత పరివారం అతని వెంట బయలుదేరింది.

పోగాపోగా, కొన్ని రోజులకు వారికి ఒక గట్టు తగిలింది. ఆ గట్టుకు పడవలను లంగరువేసి, మైదానంలో విడిసి, డేరాలు అమర్చారు. పరివారమంతా బడలికచేత డేరాలలో నిద్రపోయారు కాని, కీర్తిసాగరునికమట్టుకు కంటిమీద కునుకులేదు. అలా ఆలోచిస్తూనే పడుకొనివున్న సాగరుని చెవులకు తలవనితలంపుగా ఒక చిత్రమైన ఆర్తనాదం వినిపించింది.

ఇదేమిటా అని సాగరుడు, శ్రమలెన్నో పడి, ఆ ధ్వనివచ్చిన దిక్కుగా వెళ్ళాడు. అది ఒక అడవిప్రదేశం. చూచేసరికి, అతనికి గుండె చెరువైపోయింది. కొంత మంది మానవులను వర్తకులు కొందరు కొరడాలతో మోదుతున్నారు! చేసేదిలేక ఆ మానవులు అలోమని యేడుస్తున్నారు.

కీర్తిసాగరుడు అక్కడికి వెళ్ళి 'వాళ్లను కొట్టవద్దు. ఆగండి. వాళ్ళు చేసిన తప్పేమిటి?' అని గద్దించి అడిగాడు. అందుకు వారు "తప్పూలేదు, గిప్పూలేదు. నీకెందుకు

ఎస్. హనుమయ్య



పోవయ్యా, వాళ్ళు బానిసలు. వాళ్ళను మేం డబ్బిచ్చికొన్నాము. ఇటువంటివాళ్లను కొని మారుబేరానికి అమ్మటమే మా వ్యాపారం. మా వెంట వాళ్ళు బుద్ధిగా రాకుంటే కొట్టుతామా, చీరుతామా?" అన్నారు ఆ వర్తకులు, నిర్లక్ష్యంగా.

అప్పుడు కీర్తిసాగరుడు వారితో "ఓహో బానిసవ్యాపారుస్థులుటయ్యా మీరు! బాగానే వుంది. వీళ్ళనందరనూ నేను కొంటాను. ఖరీదు చెప్పండి. మీకు కావలసిన లాభ మెంతో చెప్పండి" అన్నాడు. వారు చెప్పారు.



ఈవిధంగా ఆ వర్తకులకు కోరినంత ధనమిచ్చి, బంధంనుండి బానిసలందరినీ విడిపించి, వర్తకులను సాగనంపాడు సాగరుడు. ఎవ రేవూరివారో పేరుపేరునా అడిగి తెలుసుకుని, వాళ్ళందరినీ ఎవళ్లయిళ్ళకు వాళ్లను పంపివేశాడు. ఇందుకు వారందరూ ఎంతో సంతోషించి, కీర్తిసాగరుణ్ణి వేయి విధాల పొగడసాగారు.

విడుదల పొందిన బానిసలందరూ వారి వారి దేశాలకు వెళ్ళిపోయారు. చివరకు ఒక సుందరీ, ఒక వృద్ధురాలు మాత్రం మిగిలిపోయారు. వారిని కుశలప్రశ్నలు వేయగా, ఆ సుందరి ఇలా చెప్పింది: "నేను ఉత్కళరాజపుత్రిని. ఈమె నా దాది. మేము దేవిఆలయంలో ఉండగా, ఈ వర్తకులు మమ్మల్ని బంధించి ఈ దేశం తెచ్చారు" అని చెప్పింది.

అక్కడికి ఉత్కళదేశం యెన్నోవందల మైళ్ళు. అందుచేత సాగరుని వెంబడి గాంధారదేశానికి వెళ్లటానికే వారిద్దరూ వప్పుకొన్నారు. వాళ్లను వెంటబెట్టుకుని తిరుగుముఖం పట్టాడు సాగరుడు.

ఇల్లు చేరుకోగానే కుబేరగుప్తుడు ఆత్రంతో కొడుకునకు ఎదురువచ్చాడు. ఎంతధనం తీసుకవచ్చాడో చూదామని ఆశ పెట్టుకొనివున్న గుప్తుడికి జవాబుగా, సాగరుడు సుందరినీ ముసలిదానినీ చూపించే




సరికి, తండ్రికి ఒళ్లు మండుకపోయింది. సాగరుడు తన ఘనకార్యాలు ఏకరుపెట్టినప్పటికీ, ఏమంత ఆప్యాయంగా వినలేదు.

"చేసుకువచ్చావులే నిర్వాకం. పో, చేతకాని దద్దమ్మా!" అని అనేశాడు.

ఈ మాటలకు రోషపడి కీర్తిసాగరుడు సుందరినీ వృద్ధురాలినీ వెంటబెట్టుకొని తక్షణమే ఇల్లువదిలి పోయాడు. అయితే, కొడుకు నిర్దోషి అని తెలుసుకొని, కుబేరగుప్తుడు వానిని వెనుకకు పిలిపించాడు.

"అబ్బాయీ!— అయిందేదో అయింది. మరొక అవకాశమిస్తున్నాను. ఈసారి నేను చెప్పినట్టుగా విని, ఐశ్వర్యంతో తిరిగి రావలసిం" దంటూ, కొడుకును ఓడరేవుకు స్వయంగా తీసుకవెళ్ళాడు. అక్కడ తయారుగా వున్న ఒక ఓడను చూపించాడు. అది చూచి సాగరుడు ఆశ్చర్యపోయాడు. ఏమీ?— ఓడముందు అందరకూ కనపడేలాగ జీవకళ ఉట్టిపడేటటువంటి ఉత్కళ రాజపుత్రి ప్రతిమ అమర్చబడివుంది!

'ఇదేమి?' టని ప్రశ్నించాడు సాగరుడు.

అందుకు తండ్రి 'అందులోనే వున్నదా రహస్యం. నన్నేమీ ప్రశ్నలువేయకు. ఒళ్లు దగ్గరపెట్టుకొని వ్యాపారం సాగించి, లాభాలు గడించుకురా. నీవు తిరిగి వచ్చేవరకు వీళ్లిద్దరూ ఇక్కడనే వుంటారు" అంటూ మందలించి పంపాడు.

కీర్తిసాగరుడు బయలుదేరాడు. కొన్నాళ్లకు ఓడ ఒకానొక రేవు చేరుకొన్నది. చేరుకొనీ చేరుకోగానే రాజభటులు కీర్తిసాగరుణ్ణి బంధించి, వాళ్ల రాజువద్దకు తీసుకపోయారు. ఇదేమిటో తెలియక సాగరుడు విస్మయంపొందాడు. 'రాజా!- ఏమిటీ అన్యాయం?' అని అడిగాడు.

అందుకు రాజు ఉగ్రుడై, "దుర్మార్గుడా!- నా కూతురు రూపాన్ని ఎందుకిలా తయారు చేసి ఓడకు కట్టావు? ఆమెను ఎక్కడ దాచావు, చెప్పు. ద్రోహీ! నిజం చెప్ప

కుంటే చూచుకో నీపని .." అని హుంక రించాడు.

ఈ మాటలవల్ల, తను చేరుకొన్న ఈ దేశమే ఉత్కళదేశమని సాగరుడు వెంటనే గ్రహించాడు. అప్పుడు, యుక్తిపరుడైన సాగరుడు ఉత్కళరాజును సముచాయించి తన చరిత్రఅంతా పూర్తిగా వివరించాడు.

కీర్తిసాగరుడు చెప్పినదంతా వినగానే రాజు పరమానంద భరితుడయ్యాడు. వెంటనే సాగరుని చేతి బేడిలు విప్పించి, అతనిని తన పక్కని కూర్చొబెట్టుకొని, సమస్తమైన మర్యాదలూ జరిపాడు.



సాగరుని కోరికపైన ఉత్కళరాజు మంత్రి సామంత సపరివారంగా గాంధార దేశానికి బయలుదేరాడు. ఈ విధంగా ఉత్కళరాజు తన ఇంటికి విచ్చేసినందుకు కుబేరగుప్తుడు పొంగిపోయాడు. రాజపుత్రి గభమనివెళ్ళి తండ్రిని కౌగలించుకున్నది. అతని కన్నులవెంట జలజలమని ఆనంద బాష్పాలు రాలినై.

'ఇటువంటి ధర్మబుద్ధి కలవాడూ, ప్రజ్ఞాశీలుడూ ఐన సాగరుడు నాకు అల్లుడు కావడంకంటె నేను కోరతగింది ఏమి లే' దన్నాడు రాజు. నిండుమనస్సుతో సమ్మతించాడు కుబేరగుప్తుడు.

తన ఇంటివద్దనే వివాహం జరిపించటానికి ఉత్కళరాజు నిశ్చయించాడు. తరలి వెళ్లటానికి అందరూ బయలుదేరారు. ఓడ ఎక్కారు.

నడివారిలోకి వెళ్ళేసరికి ఉత్కళరాజ్య మంత్రికి దుర్బుద్ధి పుట్టింది—ఈ వివాహం జరిగితే తన పలుకుబడి ఇక చెల్లదుకదా అని. ఈ దురుద్దేశం మనసులో కలగడంతో నిద్రిస్తున్న సాగరుణ్ణి నీటిలోకి తోసివేశాడు. తెల్లవారినతరువాత తెలిసింది అందరకూ, సాగరుడు కనబడటంలేదని. చేసేదేముంది? ఎవళ్లదేశం వాళ్ళు వెళ్ళిపోయారు. అక్కడ నీటిలో పడిన కీర్తిసాగరుడు యీదుకొంటూ




పోయిపోయి, ఒక ద్వీపం చేరుకొన్నాడు. అది నిర్జనప్రదేశం. అక్కడ అలానే కాలం గడుపుతూవుండగా, కొన్నాళ్లకు ఒక పడవ ఒడ్డుకు వచ్చింది. ఆ పడవ నడిపేవాడు ఒక వృద్ధుడు. అతడు సాగరుణ్ణి కుశల ప్రశ్నలువేసి సంగతి తెలుసుకొన్నాడు.

'నిన్ను నీదేశం చేరిస్తే నాకేమిస్తావు?' అని అడిగాడు. 'సగపాలు నీ కిస్తాను' అని తడుముకోకుండా బదులుచెప్పాడు సాగరుడు.

ఆ వృద్ధుడు సాగరుని సరాసరి ఉత్కళ రాజ్యతీరానికి చేర్చి, మాటాడకుండా తన దారిని తను పడవ మళ్ళించుకొని వెళ్ళి పోయాడు. కీర్తిసాగరుడు పడవ దిగి సరాసరి కోటకు పోబోతూవుండగా, ఈ కొత్తవానిని రాజభటులు పట్టి తీసుకపోయి మళ్ళీ రాజు ఎదుట నిలబెట్టారు. కీర్తిసాగరుణ్ణి చూడటంతోనే రాజు పట్టరాని సంతోషం పొందాడు. తీరని విచారంతో వున్న రాజకుమారికి ఈ వార్త చెవినిపడగానే ప్రాణం లేచివచ్చింది. నగరమంతటా కోలాహలం చెలరేగింది.

అటుతరువాత నిజానిజాలు వెల్లడి అయినై. సాగరుని కోరికపైన రాజు మంత్రిని మందలించి వదిలాడు. రాజకుమారికీ సాగరునికీ అతివైభవంగా వివాహమయింది.

రాజు తన రాజ్యానికి, అల్లుడైన సాగరుణ్ణే రాజుగా చేయదలిచి ఒక మంచిరోజున అతనికి పట్టాభిషేకం ఏర్పాటు చేశాడు. రాజదుస్తులతో నవరత్నఖచితమైన కిరీటంతో సాగరుడు సింహాసనం అధిష్ఠించాడు. దర్బారు కిటకిటలాడుతూవుంది.

ఆనందదాయకమైన అటువంటి సమయంలో ఒక పేద ముసిలివాడు అక్కడకు వచ్చాడు. వానిని భటులు అవతలకు పొమ్మని తరిమివేయసాగారు. కాని, సాగరుడు వెంటనే గుర్తుపట్టి వానిని తన వద్దకు పిలిపించాడు. సాగరుడు స్వయంగా

సింహాసనం దిగివెళ్ళి, ఆ వృద్ధునికి సమస్తమైన మర్యాదలూ చేసి, అతనిని తన పక్కన కూర్చొబెట్టుకున్నాడు.

ఎవ్వరికీ ఇదేమి అర్థంకాలేదు. అందరూ తెల్లబోయి చూస్తూవున్నారు. అప్పుడు సాగరుడు ఒక పటం తెప్పించి, దానిని సభలో గోడకు వేలాడదీయించాడు. ఆ వృద్ధునివైపు తిరిగి "నాయనా!—నీవుచేసిన మేలు నేను మరువలేదు. ఇదుగో, ఇదే ఉత్కళరాజ్య పటం. దైవకృపవలన నేను ఈ రాజ్యానికి అధిపతి నయాను. ఇందులో నీకు కావలసిన సగభాగమూ గీతగీసి చూపు. ఇప్పుడే నీకు వప్పగిస్తాను" అన్నాడు.

అందుకా వృద్ధుడు జలజలమని బాష్పాలు రాలుస్తూ సాగరునికి పాదాక్రాంతుడయ్యాడు. "సాగరా!—నీవు గుణసాగరుడవే. నాకెందుకీ రాజ్యాలు? జ్ఞాపకమున్నదో లేదో కాని, వేయిరాజ్యాల పెట్టు అయిన స్వేచ్ఛారాజ్యాన్ని ఆనాడే నీవు నాకు కోరకుండా అనుగ్రహించి పుణ్యం కట్టుకొన్నావు. నిజానికి నేను పడవనడిపే వాడిని కానేకాను. ఆనాడు నీవు బంధం విడిపించిన బానిసలలో ఒకడిని. నీవు కష్టాలలోపడటం తెలిసి, కొంతయినా నీ ఋణం తీర్చుకుందామనే వుద్దేశంతో పడవ నడిపి, ఆనాడు నిన్ను ఒడ్డుకు చేర్చాను. ఇప్పుడు నీవు రాజుకాబోతున్నావని తెలుసుకుని, దీవించిపోదామని వచ్చాను. అంతే కాని, నాకీరాజ్యాలతో ఏమీ పనిలేదు. నా తండ్రీ!" అని చెప్పాడు.

అప్పుడు సాగరుడు ఆ వృద్ధునిగురించి దర్బారులో అందరకూ విప్పిచెప్పగా, వారు విస్మయం పొందారు. 'బానిసవాడైతేనేమి, చేతికివచ్చిన సగం రాజ్యాన్ని వదులుకున్న ఆ వృద్ధుడు ఎంతటి త్యాగమూర్తి!' అంటూ అనేకవిధాల అతనిని మెచ్చుకొన్నారు.



# ఘన వైద్యులు !

*** 'దాసు'

దున్నపోతులా తిని తిరిగే
ధర్మయ కొచ్చిం దొక జబ్బు.
వైద్యాచార్యుడు వచ్చాడూ
'నా వల్ల కా'దనీ చెప్పాడు.

'పిలవండ్రా!' అన్నారు
పెద్దడాక్ట రొక డొచ్చాడూ
ఇద్దరు డాక్టర్లయ్యారూ
సాధ్యం కాదని తేల్చారు.

మూడో డాక్టరు వచ్చాడూ
మూతి విరుస్తూ అన్నాడూ:
'స్పెషలిష్టయితే మహబాగూ
శీఘ్రమె వస్తే మరి మేలు!'

నలుగురు డాక్టర్లయ్యారూ
నయము కాదని నసిగారూ,
'చూస్తా' నంటూ ఒక డొచ్చి
చటుక్కున నాడిని చేపట్టె.

డాక్టర్లయిదుగు రయ్యారూ
ధైర్యం బాగా చెప్పారూ,
'శస్త్రవైద్యమూ చేయిస్తే
చప్పున లెస్తా' డన్నారు.

సర్జనుగారూ వచ్చారూ
డాక్టర్లారుగు రయ్యారూ,
వింతపే రొకటి పెట్టారూ
విని అందరు దిగులొందారు.

పేరయగారిని పిలిచారూ
డాక్టర్లేడుగు రయ్యారూ,
నఖశిఖాంతమూ చూచారూ
దంతదోషమని పలికారు.

డెన్టిస్ట్ దేవర వచ్చాడూ
ఎనిమిదిమందీ కూడారూ,
మెదడు చెడిందని ఏకంగా
తుదకు నిశ్చయం చేశారు.

తలకొక మాటా తెలుపంగా
తత్తరపడులూ గృహమేధి
ఇంటివైద్యుడూ రామాచారిని
వెంటనె తోడ్కొని వచ్చాడు.

రామాచార్యులు రాగానే
రోగిని కంటితొ చూడకనే
'లేడీడాక్టర్ లభ్యంఅయితే
లేచి తిరుగు మనవా' డనియె.

లేడీడాక్టరు వచ్చిందీ
రోగిని పట్టిచూచిందీ,
చూచేటందుకు ఏముందీ?
చెయివా టెప్పుడొ పోయిందీ!!

# రంగులబొమ్మ కథ - 2

*

గంగన్న తల్లి అక్కడ ఇంటివద్ద ఎంతో ఆత్రంతో కొడుకుకోసం యెదురు చూస్తున్నది. అనుకొన్నట్టుగానే కొంతసేపటికల్లా గంగన్న గుమ్మంలో కాలు పెట్టాడు. వాడిని తల్లి చేరబిలిచి మంచీచెడ్డా అడిగింది. అవును అమ్మేసి చేతి నిండా ధనం తెస్తాడని ఆమె ఆశపడుతూవుండగా వాడు చెయ్యివిప్పి చిక్కుడు గింజలు చూపించాడు. చూపించి, వాటినిగురించి ఏమేమో చెప్పబోయాడు.

తల్లి ఈ మాటలేవీ వినిపించుకోలేదు సరికదా, మండిపడుతూ ఆ గింజ లను చేతికొద్దీ అవతలకు విసరివేసింది. 'ఏడింతే. ఎందుకూ పనికిరాడు. వీడివల్ల కాస్తంతా ప్రయోజనం లేదు' అని ముసలిది విసుగుకొన్నది.

ఐతే, చిత్రమేమిటోగాని—మరునాడు ముసలిది లేచేసరికి అల్లంతదూరాన పెరట్లో నవనవలాడుతూ గుబురుగా పెరిగిన ఒక పాదు కంటబడింది. చూడగా, అవి రంగులరంగుల చిక్కుడుపాదు! అది ఆకాశానికి అంటుతున్నది. దానిని చూడగా, ముసలిదాని ఆశ్చర్యానికి అంతులేకపోయింది.

గంగన్న లేచాడు. పాదు కంటబడింది. ఉత్సాహంతో ఎగిరి గంతేశాడు. అది మామూలు పాదు కాదనీ, మహిమగల పాదుఅనీ వాడికి బాగాతెలుసు. అందుచేత, చాదస్తపు తల్లితో గొడవ పెట్టుకోకుండా, ఈ పాదు మహిమలేమిటో చూడటానికి నిశ్చయించుకొన్నాడు.

గంగన్న గబగబ ఆ చిక్కుడుపాదు ఎక్కి చివరకంటా వెళ్ళిపోయాడు. ఆ పాదు చిట్టచివర మేఘమండలంలోపలికి చొరుచుకుపోయివున్నది. ఐనాసరే, జంకకుండా ఎక్కి నిలబడ్డాడు. నిలబడి నలుమూలలా కలయజూచాడు. దూరాన మేఘమండలంలో ఒక అద్భుతమైన దివ్యభవనం కనిపించింది. సరా సరి నడిచిపోయి ఆ దివ్యభవనం చేరుకున్నాడు. తలుపు తట్టాడు.

ఒక అప్సరస వచ్చి తలుపు తీసింది. "ఇదేమిటబ్బాయీ, ఇలా వచ్చావు! నీవెవరవు? ఇది జ్వాలాముఖుడనే రాక్షసరాజుయొక్క భవనమనీ, చూస్తే మింగివేస్తాడనీ తెలియదా?" అని అడిగింది.

అంతలోనే అలజడి అయేసరికి ఆమె 'సరే. ముందు ఇలా రా!' అంటూ గంగన్నను చెయ్యిపట్టుకుని తీసుకపోయి, ఒకమూల పెట్టెలో దాచిపెట్టింది.

## ఒంటిగీతబొమ్మ



ఎ. సి. కేశవరావ్



ఎస్. గోపాలరెడ్డి

## టైపు చిత్రాలు



మిస్. టి. ఆర్. సుశీల



బి. యశోదాదేవి

ఇంకా కృషిచేసి, నేర్పుచూపి, ఇటువంటి బొమ్మలను మా పాఠకులు ఎక్కువగా పంపగలరని ఆశిస్తున్నాము.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 నవంబరునెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాట లోగానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.
* సెప్టెంబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.
* మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.
* వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అక్టోబరు నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో: పశువుల కూడు | రెండవ ఫోటో: మనుజుల గూడు

పంపినవారు: సి. వి. కొండారెడ్డి, 8-లక్ష్మీపురం, రాయపేట, మదరాసు 14.

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా అక్టోబర్‌నెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- అక్టోబరుసంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

రక్షణమంత్రి

పంపినవారు :
డి. ఇ. విజయమ్ - బొంబాయి

